13800

● వనితామణికి

# నాగరికతవలననే

గౌరవం



చేనేత వస్త్రాలు, మన దేశంలో అత్యంత కళాకౌశలం గల నమూనాతజ్ఞులు, తంతువాయులవల్ల నవనాగరిక నమూనాలలో, సాంప్రదాయికంగానూ, అత్యాధునికంగానూ నేయబడ్డవి. అద్దకపు పనిలో పేరెన్నికగన్నవి. చేనేత చీరెలు, ఖన్నాలు, ఇతర వస్త్రవిశేషాలు మీరు కొన్నప్పుడు మీ కెన్నటికీ ఆశాభంగం కలగదు. వాని వెలలుకూడ ఎంతోసరసమైనవి. అందరికీ అనుకూలించునట్టివి.




# చేనేత వస్త్రాలు

● నవనాగరికతలో అగ్రస్థానం; రంగు, నేత, నాణ్యం, నమూనాలలో అమోఘం,

ఆలిండియా హాండ్‌లూం బోర్డు, మదరాసు, బొంబాయి, కాన్పూరు.

QA 56/138

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] జనవరి 1957 [సంచిక ౧

# విషయసూచిక

—(౦)—

ముఖచిత్రము : శ్రీమతి భానుమతి

By courtesy of 'SOBHA,




సంక్రాంతి గోపూజ




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## స్వవిషయము

నూతన సంవత్సరంతోబాటు యీసంచిక 26 వ సంపుటము ప్రథమ సంచికగా గృహలక్ష్మి మీ కరకమలముల నలంకరిస్తున్న సందర్భమున పాఠకులను, అభిమానులను మేముహృదయ పూర్వకముగా నభినందిస్తున్నాము.

మా గృహలక్ష్మి ఎప్పటియట్లు అభ్యుదయ రచయిత్రులను, రచయితలను ప్రోత్సహిస్తూ ప్రజలలో వినోద విజ్ఞానముల వ్యాప్తికి తోడ్పడుతూ ప్రత్యేకంగా మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహిస్తుంటుంది.

గృహలక్ష్మిలో అనాదినుండి వెలువడుచుండిన గృహవైద్యము, పాకకళ, బ్రతుకు తెరువులాంటి శీర్షికల పునరుద్ధరణకు అనుభవపరులు తమ వ్యాసములు పంపి సహకరించినచో చాల కృతజ్ఞులము. వీటితోబాటు ప్రజల ఆసక్తి ఆదరణల చూరగొంటున్న చలన చిత్ర రంగమునకు సంబంధించిన చిత్రసమీక్షలను, కళ పరి

# మా వినోదయాత్ర

## శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ

శ్రీ కన్యకాపరమేశ్వరీ బాలుర మున్నత పాఠశాలోపాధ్యాయ సంఘమును, విద్యార్థి బృందమును గడచిన యేడేళ్లుగా దక్షిణభారతంలోని అనేకస్థలాలకు యాత్రలువెళ్లి ఆ యా ప్రదేశాల్లోని చారిత్రక విషయాల్ని, నాగరకతా సంస్కృతుల్ని, ఆచార వ్యవహారాల్ని, మానవుల నిత్యజీవిత విధానాల్ని పరిశీలించి, పెక్కు క్రొత్త విషయాల్ని గ్రహిస్తూ వచ్చాయి. ప్రభుత్వ విద్యాప్రణాళికలోకూడా ఈ వినోదయాత్రలకు ఒకప్రత్యేకత ప్రాముఖ్యత ఇవ్వబడ్డవి.

మా విద్యాసంస్థ లోగడ చేసిన యాత్రలు గమనింపదగ్గవి.

| సం॥ము. | యాత్రచేసిన స్థలములు |
|---|---|
| 1949 :– | తిరుచినాపల్లి, శ్రీరంగం, |
| 1950 :– | మైసూరు. బెంగుళూరు. |
| 1951 :– | తిరువేంద్రం, మధుర, కన్యాకుమారి. |
| 1652 :– | చిదంబరం, రామేశ్వరం, తంజావూరు తిరునెల్వేలి. |
| 1953 :– | గుంటూరు, నాగార్జునకొండ, అమరావతి, విజయవాడ. |
| 1954 :– | సేలం, ఏర్కాడు, మెట్టూరు, ఈరోడ్డు, భవానీ, కోయంబత్తూరు |
| 1955 :– | కంచి, తిరువణ్ణామల, చెంజి, పుదుచ్చేరి. |

పైవాటిలో గుంటూరు ప్రాంతాలుతప్ప, తక్కినవన్నీ ఆంధ్రదేశానికి దక్షిణాన గల చోట్లే. అయినా అక్కడక్కడా, కనదగిన దృశ్యాలు, వినదగిన చరిత్రాంశాలు పెక్కులు వున్నాయి.

ఈ 1956 సం॥ మా యాత్రామార్గం పశ్చిమోత్తర సీమలకు మళ్ళించాం. బొంబాయి, ఔరంగాబాదు, ఎల్లోరా, అజంతా, హైదరాబాదులకు సంబంధించిన పెక్కు విచిత్రాలు చూడాల్నని వుబలాటపడ్డాం. ఒక బొంబాయితప్ప మిగిలినవి దక్కను పీఠభూమిలోవి. అందుచేత మాపయనం మొదట సరాసరి బొంబాయికే సాగించాల్నని తీర్మానించుకున్నాం. కార్యక్రమంగూడ తదనుగుణంగా నిర్ణయించాము. మాతోబాటు ఇద్దరు పాచకుల్ని – వంటపాత్రల్ని, భోజన పదార్థాల్ని తీసుకువెళ్లాం. 'లగేజి' కొంచెం అధికమయిందే. కాని, తప్పనిసరిగా వాటిని 'రవాణా' చేసుకొనే వెళ్ళాల్సినట్లు ఏర్పడింది. ఇక 'రైల్వే కంపార్టుమెంటులు' 'రిజర్వు' చేసుకోవటంలో ఎప్పటికప్పుడు ప్రయత్నించటంవల్ల, – కాస్త శ్రమ మనిపించినా, మా 'లీడరు' – అతడి అనుచరులు, యువకులు, వుత్సాహపరులు అవటంచేత పట్టుదలతో 'రిజర్వేషను' పొందగలిగారు. అన్నిచోట్ల మాకూ, మాబలగానికీ. సమస్త సౌకర్యాలు అమరినాయి.

మా యాత్రికబృందం 23–12–1956 ఉదయం 7 గంటలకు బొంబాయి ఎక్స్‌ప్రెస్సులో బయలుదేరింది. మద్రాసు, 'సెంట్రలుస్టేషనులో విద్యార్థుల తల్లిదండ్రులు బంధువులు స్నేహితులు వీడ్కోలిచ్చి దీవించి పంపారు.

త్రోవలో భోజన భాజనాలు కాఫీ ఫలహారాలు మాకు రైల్లోనే నడిచినాయి. గుత్తికి వచ్చేటప్పటికి పొద్దు వాటారింది. గుంతకల్లు స్టేషను చేరుకొనే సరికి బాగా చీకట్లు కమ్ముకున్నాయి. 24–12–56 తారీఖు పగలు 1.5 గంటలకు విక్టోరియా టర్మినసు బొంబాయి స్టేషనుకు మేమెక్కివచ్చిన రైలు చేరుకొన్నది. దారిలో పూనా దాటగానే కల్యాణ్ స్టేషనువరకు రైలు వెళ్ళటానికి అనుకూలంగా కొండల్లో తొలిచి చేసిన "టన్నలు" – దాదాపు ఇరవై వరకు ఉన్నాయ్. కొండలదారి అర్ధ చక్రాకారంగా వుం

డటం, వాటిమధ్య పల్లపుకనమల్లో అక్కడక్కడా చిట్టడవులు పల్లెలు వెలయటం చూచిన ప్రేక్షకులు, ఆ ప్రకృతి రామణీయకతకు ముగ్ధులవుతారు.

విక్టోరియాటర్మినసులో మాకు 'బందాబ్రదర్సు' వారి ప్రతినిధులు స్వాగతమిచ్చారు. తరువాత వారేర్పాటుచేసిన బస్సులలోను టాక్సీలలోను మాకొరకు ఏర్పాటయిన (హీరాబాదులోని) 'ధర్మభవను'కు చేరుకున్నాం. దారిబడలికతో డస్సివున్న మా యాత్రిక సమూహం రాత్రి భోజనాలయిన వెంటనే నిద్రాదేవిని ఆరాధించారు.

25-వ తారీఖున ఉదయం 8-30 గంటలకే మజ్జన భోజనాదులు ముగించుకొని మధ్యాహ్నానికి కావలసిన ఫలహారాలతో బొంబాయిలోని దర్శనీయస్థలాలను చూడటానికై రెండు బస్సులను "కాంట్రాక్టు"కు మాట్లాడుకొని ప్రయాణమయ్యాం. సముద్రపు రేవులో కట్టబడ్డ "గేట్ వే ఆఫ్ ఇండియా" అద్భుతమయిన నిర్మాణం. ఇది ఐదవజార్జి గారు మన భారతదేశానికి చక్రవర్తిగా ఢిల్లీదర్బారు జరుపుకోవటానికయి విజయంచేసినపుడు ఓడదిగి తీరాన అడుగుపెట్టటానికి అనుకూలంగా కట్టబడ్డది. దీని కెదురుగా "టాజ్ మహల్" అనే హోటలు శిల్పకళాచాతుర్యానికి పునికిపట్టు. ఈ హోటల్లో మహారాజులు, ప్రభువులు, శ్రీమంతులు బసచేస్తారు. సామాన్యప్రజల కది అందుబాటులో వుండకపోవటానికి కారణం వారి దుర్భర ఆర్థికపరిస్థితే. ఇక ఇక్కడి ప్రాచీన వస్తు ప్రదర్శనశాల (Museum) చూడతగిందే; కాని మదరాసు హైదరాబాదులలో వున్నవాటికంటె అతిశయించింది కాదు. మృగప్రదర్శనశాలకు తక్కిన నగరాల్లోమోస్తరు ప్రేక్షకులు ఏలాటిసుంకం చెల్లించనక్కరలేదు. మృగాలు కూడా యేమంత విస్తారంగాగాని, క్రొత్తవిగాగాని, విచిత్రంగాగాని కనిపించవు. వ్రేలాడే వుద్యానాలు (Hanging gardens) నిజానికి వ్రేలాడేవి కావు. ఎత్తయిన తిప్పమీద ఇవి వున్నాయి. ఆ కారణంచేత క్రింద కార్లు మొదలగువాటిలో షైరువెళ్లేవారికివి వ్రేలాడుతున్నట్లే అగపడతాయి. పైగా వీటి శోభ అంతా రాత్రిపూటలలోనే. ప్రతి వృక్షంలో ప్రతి లతలో రంగురంగుల 'బల్బు'లగుండా విద్యుద్దీపాలు అర్ధచంద్రాకారంగా ప్రకాశిస్తూ కనులపండువుగా వుంటాయి. 'కమలానెహ్రూపార్కు' మలబారుగుట్టల కొక దివ్యాభరణం అనవచ్చును. మద్రాసులోని ప్రజకు 'మెరినాబీచి' యెట్లో-అట్లే బొంబాయిలోని 'కమలానెహ్రూపార్కు' - భారతదేశంలోని యేనగరంలో ఇంతటి ఆనందదాయకం మనశ్శాంతికరం అయిన పార్కు లేదని చెప్పటం అతిశయోక్తి కాదు. దీనికి సాటి చెప్పాలంటే - ఒక్క బెంగుళూరులోని 'లాల్ బాగ్' మాత్రమే కనబడుతుంది. ఇక్కడి దేవాలయాల్లో మహాలక్ష్మి దేవాలయం చాల ప్రసిద్ధి పొందింది. ఇది సముద్రతీరాన్ని ఆనుకొని వున్నది. ఇక్కడి లక్ష్మీదేవి నిజంగా లక్ష్మీదేవే. ఎల్లప్పుడు వెండిబంగారులలో మునిగి తేలుతూ వుంటుంది. దేవీబింబం మిక్కిలి ఆకర్షణీయమయింది. బొంబాయికి అయిదారు మయిళ్ల దూరంలో "విహారసరస్సు" (Vihar lake) అనే బ్రహ్మాండమయిన చెరువున్నది. చుట్టూ చిన్నచిన్నచెట్ల గుబురులతోడి గుట్టలు - అందలి ప్రకృతివైచిత్ర్యం వర్ణించటానికి అతీయమయింది. తిరుగు ప్రయాణంలో సముద్రతీరం పొడుగునా మా బస్సులు వెళ్ళేదారి వర్తులాకారంగా ప్రయాణం చేయటంలో (గుట్టలమీద) విద్యుద్దీపకాంతులు విరజిమ్ముతూ, అందాలకు ఆటపట్టయి - ఎంతసేపుచూచినా తనివితీరని శోభతో ప్రకాశించే దృశ్యం కన్నులకు కట్టినట్లుంటుంది. ఈ దారినే - "రాణి కంఠహారం" (Queen's necklace) అని అంటారు. అది సత్యదూరం కాదు. అక్కడి "క్రాఫర్డుమార్కెటు" (Crawford market) మన మూర్మార్కెటుకు మూడింత లుంటుంది. అక్కడ వుండే దుకాణాల్లో నానావిధ వస్తువులు లభిస్తాయి. కాని ధరలు విపరీతం. బొంబాయికి ఐదారుమైళ్ళదూరంలోవున్న 'గోరేగాం' (Goregaon) అనేచోట యాంత్రిక క్షీర పరిశ్రమ శాల

(50-వ పేజి చూడుడు)

# శ్రీ సాయిబాబా - భక్తులు

మూలం :
శ్రీ ఎ. వి. శర్మ

అనుసరణ :
శ్రీ సి. సి. పున్నయ్య

(గతసంచిక తరువాయి)

స్వామి కేశవయ్యగారు వేషభాషల్లో నిరాడంబరులు. ఆయన మాటల్లో ప్రేమ ఉట్టిపడుతుంటుంది. ఆయన ఆధ్యాత్మికశక్తి, ప్రేమ సౌశీల్యములు శ్రీ స్వామిని దివ్య పురుషుడుగా నొప్పిస్తుంటవి. శ్రీ సాయిబాబా కరుణాకటాక్షములకు పాత్రులగుటకు స్వామి కేశవయ్యగారు మార్గదర్శి. ప్రతి గురువారం సాయంకాలం 5-30 గ॥లకు ప్రారంభమయిన శ్రీ బాబా పూజారాధనలు గంటసేపు జరిగిన తరువాత ఆరాధనా మందిరం తలుపు తెరువబడుతుంది. శాంతమూర్తిగా సానుభూతి పూరితమయిన చూడ్కులతో తానారాధించి అలంకరించిన శ్రీ సాయిబాబా పటము ముందు నిలుచుండి శ్రీ బాబా దర్శనారాధనలకు వచ్చువారి చేతులనుండి పుష్పములను స్వీకరించి శ్రీ బాబాకు సమర్పిస్తారు. భక్తులు తెచ్చిన ఫలభక్ష్యాలను నైవేద్యముపెట్టి ఎవరివివారికిస్తుంటారు. భక్తిపారవశ్యంతో కొందరు ఫలభక్ష్యాదులను శ్రీ బాబా పటమున కెదురుగానుంచి వెళ్ళుట కలదు. అలాగ ఉంచి వెళ్లిన వానిని స్వామి కేశవయ్యగారు తనకు తోచినవారికి పంచిపెడ్తుంటారు. స్వామి కేశవయ్యగారు వచ్చినవారికి ప్రతి ఒక్కరికి ముఖాన విభూదిపెట్టి, నోట్లో కొంచము వేసి, చేతిలో కొంచముపెట్టి ముఖంవంక సానుభూతితో ప్రశ్నార్థకంగా చూడ్కులు ప్రసరిస్తారు. అప్పుడాయనలోని దివ్యత్వము ప్రతి యొక్కరిని పులకరింపజేస్తుంది. మనసులో నేవైన చెడ్డతలంపులు, ఉద్దేశములుండి అక్కడికిపోయినవారు ఆ యారాధనా మందిరంలోకే పోలేరు. అలా పోయినా వారి కర్మ విముక్తికి శ్రీ బాబా ఆదేశానుసారము గడువు నిర్ణయించి ప్రసాదం యిచ్చిపంపుతారు. తమ బాధలను, సమస్యలను నివేదించి రక్షణను అర్థించిన భక్తులకు శ్రీ బాబానుండి తన ఆధ్యాత్మిక శక్తితో ఆజ్ఞలను స్వీకరించి కర్మ విముక్తికి మార్గములను, సూచనలను యిస్తుంటారు. అవి భక్తులకు సంతృప్తిని, మానసిక శారీరక స్వస్థతలను సమకూర్చుచుండుట మహిమాన్వితంగా నుంటుంది. భక్తులు దండప్రణామము లాచరించునపుడు శిరస్సులను, వీపును స్పృశించడముకలదు. అది వారి కర్మ విముక్తి వేగమును పెంచునని ఆయన విశ్వాసము - నిజానికి ఆయన స్పర్శ, భయ, దుఃఖ, కష్టములనుండి త్వరగా విముక్తిని ప్రసాదించు అమోఘమైన ప్రభావముకలది. స్వామి కేశవయ్యగారుపెట్టే ప్రసాదం భక్తులను అన్ని విధాల పరిశుద్ధపరచుట కుద్దేశించబడినది. విపత్తు, ప్రమాదావస్థలలోనున్న భక్తుల రక్షణకు శ్రీ బాబా విభూది పొట్లములను కట్టి యిచ్చి నిర్ణీతకాలంవరకు దగ్గర నుంచుకొనునట్లుగా ఆదేశించిన ఫలితంగా అనేకమంది పీడితులకు రక్షణ, స్వస్థతలు సమకూరుచున్నవి.

శ్రీ కేశవయ్యగారికి శ్రీ బాబా అనుగ్రహం దివ్యదృష్టిని ప్రసాదించింది. అది భక్తుల భవిష్యత్ యోగక్షేమాలను - గృహ సంబంధమైన, సాంఘిక, ఆర్థిక చిక్కులను తెలిసికొనుటకు, కోరినవారికి రక్షణ స్వస్థతల నిచ్చుటకు వినియోగపడుతుంటుంది. ఒక్కొక్కప్పుడు శ్రీ బాబా సరియయినసూచనలు, ఆదేశాలు భక్తుల కర్మ విముక్తికి లభించనప్పుడు గడువును నిర్ణయించి మరొక వారంనాడు రమ్మంటారు. ఆనాడు భవిష్యత్తును గురించి, సమస్యల పరిష్కారమును గురించి ఉన్న దున్నట్లుగా చెప్పుచుండురు.

శ్రీ కేశవయ్యగారు ఏ పరిస్థితులలోను అపోహలను, పేరాశలను, దురాశలను కల్పించరు. ఆయనకు కోపమనేదిరాదు. బహుకొద్ది సరళమైన మాటలలో భక్తుల ప్రశ్నలకు జబాబులిస్తారు. ఆయన ప్రత్యేకముగా నెవరిని ప్రీతి పరచుటకు ప్రయత్నించరు. అందరు ఆయనకు సమానులు. ఆయన వాక్కులు ప్రతియొక్కరికి ఉపశమనాన్ని కలిగించగల మృదువైనవి. అందువలన ఆయన మాటలలోని భరింపరాని, సహింపరాని సత్యాన్ని సయితము ఒక్కొక్కప్పుడు భక్తులు ప్రశాంత చిత్తులుగా స్వీకరించకలుగుతారు. గురువారమునాడు శ్రీ స్వామి కేశవయ్యగారిని శ్రీ శాయిబాబా ఆరాధన దగ్గర దర్శించిన భక్తులు ప్రేమసానుభూతులతోకూడిన ఆశీస్సులను పొంది ప్రసాదమును స్వీకరించుట అత్యంతోత్సాహంగా నుంటుంది. స్వామి కేశవయ్యగారి స్పర్శ దుష్ట చింతలను పారద్రోలి పవిత్రులుగాచేసి నైతికంగా, ఆధ్యాత్మికంగా ఉద్ధరించుచున్నది. ఈర్ష్య, సంకుచిత తత్వాలతో స్వార్థపరులుగా పారమార్థిక చింతకు దూరమయినవారిలో సానుభూతి, దయాదాక్షిణ్యాలను, దానధర్మ గుణాలను, విశ్వప్రేమ, అహింసలను, త్యాగసేవాసక్తిని శ్రీ స్వామి కేశవయ్యగారిని స్వార్థసేవ ప్రోత్సహించుచు మహిమోపేతంగా శాంతి సౌభాగ్య కాముకులుగా రూపొందించుచున్నది. ఆయన దివ్య ప్రభావము ఉత్తమ భావాలను, ఆదర్శ లక్ష్యాలను పూరించునదిగా నున్నది. ఆయనద్వారా జీవిత మార్గము ననుసరించువారి బంకమట్టి హృదయాలను అగ్నిలాంటివానిగా శ్రీ శాయిబాబా మార్పు చేయును.

స్వామి కేశవయ్యగారి సందేశములో అత్యంత ప్రధానమైనది పూజాసమయాలలోగాని, మరొకప్పుడుగాని ద్రవ్యరూపంలో కానుకలను స్వీకరించరు. ఆయన పూజారాధనల నిమిత్తం హుండిసేకరణను సయితము ప్రోత్సహించరు. 'ధనమే అవినీతికి, పాపమునకు, దుఃఖమునకు కారణ'మని ఆయన విశ్వాసము.

పూజ్యులు స్వామి కేశవయ్యగారు ఉత్తమశాయి భక్తులు. శ్రీ బాబా ఆధ్యాత్మిక వారసుడుగా ఆయన దివ్యసందేశపు వ్యాప్తికి నిర్విరామంగా కృషిచేస్తున్నారు. ఆధ్యాత్మిక పురోభివృద్ధికి శ్రీబాబా సందేశాన్ని దివ్యజ్యోతిగా కలవాడు. ఆయన భక్తకోటికి మానసిక, శారీరక బాధలనుండి విముక్తిని ప్రాసాదించు రక్షకుడు. ఆయన నిస్పృహ, నిరాశలకు బలియయిన అనేకుల జీవితాలలో ఆశను, సౌభాగ్యాన్ని చిగిరిస్తున్నాడు. ఆయన మార్గదర్శకత్వము మన ఆధ్యాత్మికస్థాయిని పెంపుచేయుటతోబాటు మన అవసరాలను అవకాశాలను కనిపెట్టి రక్షిస్తున్న అవతారపురుషుడైన శ్రీ శాయిబాబాపట్ల భక్తిని ప్రోత్సహించి ఆయన అనంత ప్రేమవాత్సల్యాలకు పాత్రులముగా పూర్ణ పురుషుల మగుటకు తోడ్పడుచున్నది.

రోజులు గడచినకొలది భక్తుల సంఖ్యవందలు, వేలుగా పెరిగేసరికి మేడమీదనున్న పూజామందిరము మెట్లెక్కుటకు, దిగుటకు కొంతయిబ్బంది కలిగించింది. భక్తుల అనుకూలాన్నుద్దేశించి ఆ భవనపుక్రింది ముందువైపుగదిని పూజామందిరంగా మార్చి 1956 సం॥ ఆగష్టు 12వ తేది నాడు అందులో వేదోక్తంగా అలంకరించబడిన సింహాసనంమీద బాబాపటము ప్రతిష్ట చేయబడి, షుమారు వెయ్యిమంది బీదలకు మధ్యాహ్నము అన్నప్రదానము జరిగెను. సాయంకాలము శ్రీబాబా నామసంకీర్తన, భజనలతో ప్రారంభమయిన కార్యక్రమములో దివాన్‌బహదూరు కె. యస్. రామస్వామి శాస్త్రిగారు శ్రీశాయిబాబా సందేశము యొక్క ప్రాశస్త్యమును మద్రాసు వాసుల శాంతి సౌభాగ్యాలనుద్దేశించిదానిని ప్రచారము చేయుచున్న స్వామి కేశవయ్యగారిని గురించి ఉపన్యసించారు.

శ్రీ శాయిబాబా దివ్య సందేశము యొక్క ఆదర్శ లక్ష్యాలుసిద్ధించి, ఆయనభక్తుడు స్వామికేశవయ్యగారు మనకెల్లప్పుడు అందుబాటులోనుండి మనలను సరిదిద్దుతూ, స్వస్థతపరుస్తూ, పాపమునుండి, దురుద్దేశాలనుండి తప్పిస్తూ జీవితలక్ష్యమైన ముక్తి సాధనయగు ఆత్మజ్ఞానమును పొందుటకు తోడ్పడుగాక! శ్రీ బాబాయొక్క ఆశీస్సులు ఆయనభక్తులు తమనడతను సరిదిద్దుకొనుటకు, హృదయ పరివర్తన పొందుటకు, ఆత్మలను పరిశుద్ధపరచుకొనుటకు తోడ్పడుగాక!

# దేవదూత

శ్రీ సి. సి. పున్నయ్య

అవి వేసవికాలపు రోజులు. మధ్యాహ్న సమయము. తారు రోడ్లు భగ భగ మండుతున్నవి. ఎండ వేడిమికి మనుష్యులు సేదదీర్చుకుంటుంటే పక్షులు సయితము చెట్ల కొమ్మలమీద తలదాచుకొని నోళ్లు తెరచి ఆరాటపడుతున్నవి. జనసంచారము బహు స్వల్పముగా నున్నది. రోడ్డు ప్రక్కగా చీలికలు పేలికలయిన చొక్కా, షరాయిలతో కాళ్ళకు చెప్పులయినా లేకుండా క్రింద పైన మండుతూ నడుస్తున్నాడు. ఒళ్ళు, గుడ్డలు దుమ్ము ధూళితో ఆవరించియున్నది. ముఖం వాడిపోయి ఏనాడో భోంచేసిన వ్యక్తిలాగ కనుపించాడు. నడక బహు నీరసంగా నున్నది. పదే పదే చేతిలోని రెండు అణా బిళ్ళలను చూచుకుంటూ, మరల షరాయి జేబులో వేసికుంటూ నడుస్తున్నాడు. దారిన అక్కడక్కడ దుకాణములలో తినుబండారములమ్ముతున్నా, కొనేవాడిలాగ సమీపానికిపోయి మరల వెనుకకు తిరిగి నడక సాగిస్తున్నాడు. తన దగ్గరనున్న బేడ డబ్బులతో ఏదైనా కొనుక్కొనితిని ఆకలి తీర్చుకోవాలని యున్నట్లున్నది, కాని దానితో ఆకలి తీరదనే నిస్పృహ అతని వాలకంలో కనుపిస్తున్నది. అతనికి గల ఆశ—సాయంకాలము వరకు అలాగే గడిపితే లభ్యమయ్యే డబ్బులతో కడుపు నింపుకోవచ్చనేది.

అదొక వేపచెట్టు. దాని నీడ అనేకశ్రమజీవులకు ఎండలో ఆశ్రయమిస్తుంది. ఏధర్మాత్ముడో చెట్టుమొదట్లో చుట్టూ సిమెంటు అరుగు కట్టించాడు. దానిమీద అనేకులు కూర్చొని, పండుకొని సేదదీర్చుకుంటుంటారు. అక్కడే ఒకడు టీ, రొట్టె ముక్కలు అమ్ముతుంటాడు. మరొక ప్రక్కన ఒక ముసలమ్మ వేరుశనగ కాయలు, ఉడకబెట్టిన చిలకడ దుంపలు, రాచ ఉసిరి కాయలు కుప్పలుపెట్టి అమ్ముతుంటుంది. స్రొక్కుతూ స్రోలుతూ ఆ బాలుడు ఆ చెట్టు నీడకు చేరుకొని అరుగుమీద కూలబడ్డాడు. కోలాహలంగా టీ నీళ్ళకు, ముసలమ్మ చుట్టూ గెనుసు గడ్డలకు, వేరుశనగ కాయలకు ఎగబడుతున్న శ్రమ జీవులు ఆ బాలుని ఆకర్షించారు. కొందరు ఆప్యాయంగా టీ త్రాగుతున్నారు. మరి కొందరు అరుగుమీద కూర్చొని వేరుశనగ కాయలు, గెనుసు గడ్డలు తిని కడుపులు నింపుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వారి చెమటతోటి, దుమ్ము ధూళితోటి ఆవరించియున్న దేహాలు సూర్యరశ్మిలో తళ తళ మెరుస్తున్నవి. వాళ్ళను చూడను చూడను అతని ఆకలితారామండలంగా దహించుకపోతున్నది. అక్కడయున్నవాళ్ళు అతని ముఖ వాలకం చూచి "అయ్యో పాపం! ఎన్ని రోజులయిందో అన్నము తిని" అనకలిగినవారేకాని తామే అర్థ కడుపైనా నింపుకోలేని పీడిత ప్రజలు అతనికేం సహాయం చేయగలరు!

అప్పటి వరకు చెట్టునీడననున్న ముసలాడు ఒక చేతిలో కర్ర, మరొక చేతిలో డబ్బాతో వణకుతూ రోడ్డును దాటసాగాడు. సగందూరం దాటేసరికి ఒక సైకిలువచ్చి డీ కొని చేతిలోని కర్ర ఒకవైపు, డబ్బా మరియొక వైపు క్రిందపడిపోయి ముసలాడు నేలకొరిగాడు. డబ్బాలోని అణా డబ్బులు రోడ్డుమీద దొర్లిపోయినవి. కనబడీ, కనబడని చూపుతో క్రింద దొర్లిపోయిన డబ్బుల కొరకు తవుడులాడసాగాడు ముసలాడు. వస్తూపోతూవున్నవారు ఎవరి వ్యాపకంమీద వారు వెళుతున్నారు కాని నడిరోడ్డున, మండుటెండలో పడిపోయిన ముసలాడి అతీ, గతీ ఎవరినీ ఆకర్షించలేదు. దీన్ని చూస్తున్న బాలుడు మెల్లగా ముసలాడి దగ్గరకువెళ్లి రోడ్డుమీద దొర్లి పడియున్న డబ్బులను ఏరి డబ్బాలో వేస్తూ "తాతా! యివిగో నీ దొర్లిపోయిన డబ్బులు—ఈ వయస్సులో తోడు లేకుండా తిరిగితే ప్రమాదం కదూ!— నేను పట్టు

కొని మెల్లగా అవతలికి చేరుస్తాను పద — కార్లు బండ్లు వచ్చేలోపల" అని చేయూతయిచ్చి లేపి కర్ర, డబ్బా అందిచ్చాడు.

మెల్లగా నడుస్తూ "ఎవరు బాబూ! నీవు— జీవ దూతలాగ వచ్చావు! నాబోటి దిక్కు లేనివాడికి భగవంతుడు తప్ప మరెవ్వరు తోడుంటారు" అన్నాడు.

"తాతా! నాకూ నా అనేవాళ్ళెవరూ లేరు— ఉన్నవాళ్ళైనా యింకా ఏమైనా నా దగ్గర లభిస్తే దోస్తామనుకునేవారే కాని లేనిపూట పిలిచి పిడికెడు మెతుకులు పెట్టేవారులేరు. నీ మాదిరిగానే భగవంతుని నమ్మి తిరుగుతూ, ఉన్ననాడు తిని లేనినాడు లేనట్లుగా జీవయాత్ర సాగిస్తున్నాను. నీకు అభ్యంతరము లేకపోతే నీకు తోడుగానుండి లభించిన దానిని యిద్దరం పంచుకుందాము" అన్నాడు తాను ముసలాడి ప్రాపకంతోనైనా తిండికిలోటులేకుండా జీవయాత్ర సాగుతుందికదా యని. ముసలాడు సయితం తను లేవ లేనిరోజులలో కబోదిగా తనకు యీ బాలుడు తోడు నీడగా నుండటానికి భగవత్ప్రేరితుడై తన దగ్గరకు వచ్చాడనే నమ్మకంతో సరేనన్నాడు.

"ఏం బాబూ! యీ రోజు నీవు భోంచేసినట్లు లేదే—పోయి ఏదైనా తినిరా" అంటూ చొక్కా జేబులోని పావలా బిళ్ళ తీసి యిచ్చాడు. ముసలాడు రోడ్డు ప్రక్కన చతికిలబడి ఆ పిల్లవాడు ఒక రొట్టె ముక్క, టీ నీళ్లు త్రాగి ముసలాడికొక రొట్టె, అర కప్పు టీ తెచ్చి యిచ్చాడు.

ముసలాడి ముఖం వికసించింది. "బాబూ! నీ లాటి పిల్లవాడు నాకున్నట్లయితే యీ వయస్సులో నా కెంత సహాయంగానో ఉండేది" అన్నాడు రొట్టెను తుంచుకొని తింటూ.

"ఆ కొరత తీర్చటానికి నేను వచ్చాను కదా తాతా!" అన్నాడా పిల్లవాడు. రొట్టె తిని, టీ త్రాగి కాగానే ముసలాడు, పిల్లవాడు నగర మధ్యం లోకి వెళ్ళారు.

సాయంకాల మయింది. ఆకాశాన్నంటుతున్న మేడలు, మిద్దెలు, ధగ ధగాయ మానంగా వెలుగుతున్న విద్యుద్దీపాలు యీ ప్రపంచంలో దరిద్రమనేదే లేదనిపిస్తున్నవి. తమ నిత్యజీవితము ఎలాగ గడుస్తున్నా దరిద్రులు, సంపన్నులుకూడ చలవ దుస్తులతో, తళ తళ లాడే నగలతో అటు యిటు తిరుగుతున్నారు. కాని ధరించిన నగలు బంగారవునో కాదో, దుస్తులు తమవౌనో కాదో భగవంతునికే తెలియాలి. ఆ విద్యుద్దీప కాంతుల్లో బీదలు, ధనవంతులు ఒకే రకంగానే కనుపించారు. నగరాల్లోని లేమిడిని చలవగుడ్డలు, కృత్రిమ నగలు మరుగుపరుస్తుంటవి.

జనసమ్మర్దంలో ముసలాడు, అతని వెంట బాలుడు "అమ్మా! బాబూ! దిక్కులేనివాళ్ళం — ధర్మం చెయ్యండి" అంటూ దీనాలాపాలు చేస్తున్నారు. కానీ డబ్బు యిచ్చిన ధర్మాత్ములకంటె వాళ్ళ వైపు చూడనైనా చూడకుండా పోయే మహారాజుల సంఖ్యయే అధికమనిపించింది. రాత్రి 9 గంటలయేసరికి రెండు రూపాయల డబ్బులు దొరికినవి. ఇద్దరూ ఆకలిని చల్లార్చుకొని పాడుపడియున్న చావడిలోకి విశ్రమించడానికి వెళ్ళారు.

ప్రతిదినం నగరంలో తిరుగుతూ పిల్లాడు ముసలాడిని ఏవేవో ప్రశ్నలు వేస్తుండేవాడు. ముసలాడు సయితం ఓర్పుతో తనకు తెలిసినంతవరకు అతనిని సమాధాన పరిచేవాడు. త్రోవన ఎత్తైన భవనాలతో పాటు ఉన్నతులైన వ్యక్తులు సయితం వారి కెదురయ్యేవారు. అందులో ముసలాడికి పూర్వ పరిచితులే కాదు—తన సహాయ సహకారాలతో రాజకీయంగా ఆర్థికంగా ఉన్నత పథమునందుకున్న వారనేకులుండేవారు; వారి అవసరాలు గడిచేవరకు స్నేహితులుగా ఆప్తులుగానుండి తర్వాత ఆ బీదవాడిని ఆకలి దప్పులకు బలిచేసిన స్వార్థపరులు, ఎదురుపడినప్పుడు సయితం అతనితో పలికితే అణా డబ్బులు యివ్వాల్సి వస్తుందని ముఖం తప్పించి నడిచేవారు.

ఆ రోజు మహాత్యమేమిటో కాని నివాసం బయలుదేరినప్పటినుండి మధ్యాహ్నం పన్నెండు గంటలవరకు

నాలుగు కానులు మాత్రమే లభించినవి. వాళ్ల ముఖాలపై నిస్పృహ తాండవిస్తున్నది. అయినా నడక సాగిస్తున్నారు. ఒక రాజభవనంలాంటి మేడ దగ్గరకు వచ్చారు. దాని ముందు తోటలో అనేక రకాల పుష్పములు పూచి కనుల కింపుగా నున్నది. ఆ భవనంలోకి వస్తూ పోతున్న మనుష్యులనుబట్టి పెద్ద వ్యాపార సంస్థయనిపించింది.

"బాబూ! యీ మేడ ఎవరిదనుకొన్నావు!— ధర్మాత్ముడు నరసయ్యగారిది. బీదవాడుగా జీవయాత్ర ప్రారంభించి లక్షలు ఆర్జించాడు. నేను యిక్కడ ఆయన దగ్గర కొన్ని సంవత్సరాలు పని చేశాను" అన్నాడు.

అంతలో ఒకాయన సూటు, బూటు వేసుకొని ఠీవిగా కళ్ళద్దాలను సవరించుకుంటూ బయటికి వచ్చాడు.

"నమస్కారం బాబయ్యా!" అన్నాడు అతనిని చూచి ముసలాడు. దాన్ని గమనించనట్లు వెళ్ళిపోయాడు ఆ విలాస పురుషుడు.

"ఎవరు తాతా! యిలా పోయిండి—నమస్కారం పెడితే కన్నెత్తిఅయినా చూడకుండా పోయాడు."

"ఆయన యీనాడు నరసయ్యగారి సర్వస్వమునకు మేనేజరు. ఆయనకు మనమంటే లక్ష్యమెందుకుండాలి! అసలు నరసయ్యే తన మన అనే స్వకులాభిమానం, స్వబంధు అభిమానం లేకుండా సంపాదించినదంతా కులము గోత్రముకానివారలకు కట్టబెట్టిపోతే రాళ్లుకోడానికి వచ్చిన యీయనబోటివారికి దయ దాక్షిణ్యాలు ఎలాగుంటవి మనమీద!"

"అయితే యీ వ్యాపార సంస్థ నిర్వహణంతా యింతకాలంనుంచి యీయనే చేశాడన్నమాట!"

"పిచ్చివాడా - యీయన మధ్యలో వచ్చినవాడు — సంవత్సరాల పర్యంతము అల్ప జీతాలతో చాకిరి చేసిన ఫలితమే యీనాటి సిరిసంపదలు, రాజభోగాలున్నూ. ఈయన హయాంలో ఆర్జించిన వేలు లక్షలు లేకపోగా దాన ధర్మాలకు, దయా దాక్షిణ్యాలకు పేరుపొందిన నరసయ్యగారి పేరు చెడిపోడు."

అక్కడినుండి మెల్లగా కదిలి నిత్య కార్యక్రమానికి బయలుదేరారు. ఒక హోటలు దగ్గరకు చేరుకున్నారు. దాని ప్రక్కనున్న ఎంగిలాకుల కుప్పదగ్గర రెండు కుక్కలు హోరాహోరిగా పోరాడుతున్నవి. అందులో ఒకటి సర్వకాల సర్వావస్థలలో ఆ కుప్పను ఆశ్రయించుకొని యుండేది. మరొకటి ఎక్కడినుండో వచ్చినది. క్రొత్తగా వచ్చిన కుక్క రాకను ప్రాత కుక్క సహించలేక వీరవిహారం సల్పింది. దాని ధాటికి తట్టుకోలేక క్రొత్తగావచ్చిన కుక్క పలాయన మంత్రము పఠించింది.

ఆ రోజునుండి యిద్దరికి తృప్తికరమైన ఆదాయం లభించకపోవడం యిరువురిలో అసంతృప్తిని రేకెత్తించింది. పైగా ముసలాడి ఆరోగ్యం సరిగ్గాయుండక పోవడం పిల్లవాడిని చీకాకు పరచింది.

"ఈ ముసలాడు రాను రాను సోమరి యగుతున్నాడు. ఇతని వెంబడియున్నందువలన కడుపు నిండకపోగా, లేనిపోని వృధాశ్రమ మిగులుతోంది" అనుకోసాగాడు పిల్లవాడు.

"ఈ పిల్లాడు వచ్చినప్పటినుండి రోజూ దొరికే డబ్బులుకూడ దొరకడంలేదు. నా ఎప్పటి శ్రమ ఎలాగూయున్నదినాకు. లభించేకానియో, దమ్మిడియో అతనికి పంచియిచ్చి నా కడుపు కాల్చుకోడం ఎందుకు" అనుకోసాగాడు ముసలాడు.

నాలుగు రోజులు గడిచినవి. ఒకరోజురాత్రి నీరసంగా ముసలాడు పండుకొని యున్నాడు. పిల్లాడు ఎదురుగా కూర్చొని యున్నాడు.

"బాబూ! డబ్బాలో ఎన్ని డబ్బులున్నవో చూడు" అంటూ డబ్బా అందిచ్చాడు.

బాలుడు డబ్బులు లెక్కబెట్టసాగాడు. లెక్కబెడుతున్న కదలికనుబట్టి "పది, పదకొండు అణాలు దొరికియుండాలి బాబూ!" అన్నాడు.

లెక్క బెట్టడం పూర్తిచేసి "ఎక్కడిది తాతా! అంతా ఆరు అణాలున్నవి"

"ఆదేమిటి నాయనా! పది అణాలైనా దొరికియుంటుంది అనుకున్నానే!"

"నీవనుకుంటే లేని డబ్బులుంటవా! నన్ను నమ్మ లేకపోతే నీవే లెక్కించుకో" అంటూ జేబులో ఏవో డబ్బులు దాస్తూ డబ్బా అందిచ్చాడు.

డబ్బాలోని డబ్బులను తడువుతూ "ఎందుకు లే బాబూ! నీమీద నమ్మకంలేక కాదు నేనలా అన్నది! ఈ డబ్బులు తీసికొని వెళ్ళి మనం తింటానికేదైనా తీసికొనిరా" అంటూ డబ్బాలోని డబ్బులను పిల్లవాడికిచ్చాడు.

పోయిన పిల్లవాడు ఎంతసేపటికీ తిరిగిరాలేదు. ముసలాడి ఆకలి దహించుకొనిపోతున్నా పళ్లు బిగబట్టి కండ్లు మూసుకొని పండుకున్నాడు. హోటలు దగ్గరి ఎంగిలాకుల కుప్పదగ్గర ఎప్పుడుండే కుక్క ఎంగిలి మెతుకులను నాకి తింటూ ఆ ఆకుల్లోనే పొర్లాడుతున్నది.

# కేసరి విద్యాలయాలకు శ్రీ రామకృష్ణ దంపతుల విరాళము

3-1-57 తేదిని శ్రీ త్యాగరాయనగరములోని కేసరిస్కూళ్ల ప్రార్థన మందిరమయిన శ్రీ వేంకటేశ్వర హాలులో కేసరి మిడిల్‌స్కూలు నిర్వహణకు రు. 4000 లు విరాళము ఇచ్చిన శ్రీ పాలువాయి రామకృష్ణగారు, వారి సతీమణి శ్రీమతి భానుమతిగార్ల ఫోటో ఇండియా ప్రభుత్వము మాజీ మంత్రి బారిష్టరు శ్రీ వి. వి. గిరిగారిచేత ఆవిష్కరింపబడినది. సభకు మాజీ హైకోర్టు జడ్జి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు మొదలయినవారు పెక్కుమందివిచ్చేసిరి. దివాన్ బహదూరు బండి శ్రీహరిరావు నాయుడుగారు వచ్చిన సభికులకు స్వాగతము చెప్పుతూ కీ॥ శే॥ డాక్టరు కేసరిగారి ఔదార్యమును జ్ఞప్తికి తెచ్చి, అటువంటి ఉదారులు అన్ని రంగములలోకూడా వున్నారని సంతోషించుచున్నామని చెప్పిరి. శ్రీమతి భానుమతిగారికి ఆంధ్ర గవర్నమెంటు చేసిన సన్మానమునకు అభినందించుచూ ఆసన్మానము అర్హమైనదనిరి. ఆమెయు ఆమె భర్త శ్రీ రామకృష్ణగారు అడిగినవెంటనే తెలుగు పిల్లల విద్యకు 4000 రూ. ఇచ్చుటచేత వారి ఔదార్యమును వెల్లడించుచున్నారని చెప్పిరి. శ్రీ గిరిగారు బాల బాలికల నుద్దేశించి కీ॥ శే॥ డాక్టరు కేసరిగారు చేసిన అపార సేవను, శ్రీ హరిరావుగారు చూపించుచున్న ఉత్సాహమును పొగడిరి. శ్రీమతి భానుమతిగారుఆంధ్ర గవర్నమెంటు చేసిన గౌరవమునకు ఎంతెమో అర్హులనియు, స్కూలుకు ఇచ్చిన విరాళమువల్ల ఆ దంపతుల మనోవికాసము చెప్పకయే చాటుతున్నవనియు వారి ఫోటో ఆవిష్కరించుటకు తాను యెంతో సంతోషించుచున్నానని చెప్పిరి. ఆవిష్కరణ తర్వాత కేసరి మిడిల్ స్కూలు పిల్లల నాట్యమును, నాటకము ప్రదర్శించబడెను. మిడిల్ స్కూలు ప్రధానోపాధ్యాయిని శ్రీమతి టి. వసంతలక్ష్మిగారు అర్పించిన వందనములతో సభ ముగిసెను.

# వాళ్లనలా వదిలేద్దాం

శ్రీ నేమాని సంగమేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

"ఎలావున్నారే?"

"అదేమో! నాకు నచ్చేరు! అయినా నీకు చెపితే అతిశయంలాగుంటింది కాని నా అదృష్టమనుకో!"

"ఆహా! అలాగా! అంత అందగాడా! అయితే అట్టే పొగడకు! నీకు కాబోయే భర్తగారికి దృష్టిదోషం తగులుతుంది,"

"ఆ! చాలించు నీ వేళకోళాలు! చూస్తావుగా పెళ్ళిలో! అన్నట్టు ఇంకా చాలమంది ఇళ్లకి వెళ్లాలి. పెరసనలుగా వెళ్ళి పిలవకపోతే తప్పించుకుంటారని నేనే స్వయంగా బయలుదేరేను! నువ్వురాక పోతే నా మీద ఒట్టే! నన్ను చంపుకో తిన్నట్టే! .. "అంటూ లేచింది రవణమ్మ.

"ఎందుకే అంతంత ఒట్లు! నేను తప్పకుండా వస్తాగా! ఉండు ... ఒక సిప్పు కాఫీతాగి పోదువుగాని–" అంటూ వంటలక్కకు కేక పెట్టింది దమయంతి.

"అయినా నువ్వింత వేగిరం పెళ్ళిచేసుకోవడం నా కిష్టంలేదే! చూడు మన జానకి – అప్పుడే ఒక ఆడపిల్లకూడాను –" అంది దమయంతి కొంచం విరక్తిభావంతో.

"మనం దేనికీ కారకులం కామనుకో! ఎలా జరుగవలసింది అలాగే జరుగుతుంది. చిన్నప్పటి భావాలు వుద్దేశాలు పెద్దయ్యాక వాతావరణాన్ని బట్టి మార్చుకోవాలి–" అంది వేదాంతధోరణిలో రవణమ్మ.

రవణమ్మ మాటలకు ఒకసారి పేలవంగా నవ్వింది దమయంతి.

వంటలక్క కాఫీ తెచ్చి టేబిలు మీద పెట్టి పోయింది. ఇద్దరూ త్రాగేరు.

"వస్తా! రావడం మానీకూడదు సుమీ! ఒకరోజుముందుగా వస్తే సంతోషం. మనస్నేహితురాండ్రు అందరూ అలాగే వస్తారు" అంటూ లేచింది రవణమ్మ.

"అలాగే లేవే!"

రవణమ్మ వెళ్లిపోయింది.

"ఎవరే?" అంటూ ప్రవేశించింది తల్లి.

"మా స్నేహితురాలు రవణమ్మకు 24-వ తారీకులన పెళ్ళట - పిలవడానికి స్వయంగా వచ్చింది" అంది దమయంతి.

"చూసేవా! అప్పుడేనీతోటివాళ్లందరికి

పెళ్ళిళ్లు అయి, మొగళ్లతో కాపురాలు చేస్తూ పిల్లలనుకూడా కంటున్నారు. నువ్వు ఒక్కతెవు మాత్రమే పెళ్లివద్దని ఒకటే గోల! వచ్చే మాఘంలో నీ పెళ్లి చేసెయ్యాలి......'' ఇలా అంటున్న తల్లి మాటలు పట్టించుకోకుండానే మౌనంగా మేడమెట్లు ఎక్కి తన గదిలోకి వెళ్లింది దమయంతి.

2

రవణమ్మ పెళ్లికి తను మొదట వెళ్లడానికి యిష్టపడలేదు దమయంతి! ఆ కోలాహలం ఆ గడబిడలు... అవన్నీ తనకు సరిపోవు.

ప్రశాంత వాతావరణము, ఏకాంత విహారము కోరే దమయంతి అలా అనుకోవడము సహజమే!

అయితే వెళ్లకూడదనుకునే వెళ్లింది! రవణమ్మ వివాహసమయంలో ఏదయినా ప్రజెంటు చెయ్యాలన్న వూహేరాలేదు దమయంతికి! సినీమా చూసి రావడానికి బయలుదేరినట్టు బయలుదేరింది!

పెళ్లివాళ్ల యిల్లు ఆనందనిలయములా ఆనందముతో కళకళలాడుతూ ప్రకాశిస్తున్నది. వంటబ్రాహ్మణుల కేకలు, పేరంటాళ్ల సందడులు, పిల్లల అల్లరలు, పసివాళ్ల ఏడుపులు, ఒకమూల పేకాటలో లీనమయిన ప్రముఖుల వాదనలు, బాజావాళ్ల గోల......ఇలా వున్న ఆయింటిని చూసి ఒక్కమారు వుక్కిరి బిక్కిరి అయింది దమయంతి!

తనకంటె ముందే, సరోజ, శాంతి, సుగుణ వచ్చినట్టువుంది! పెళ్లి కూతురికి అలంకరిస్తున్నారు, హాస్యాలాడుతూ! జానకికూడా కుమార్తెనెత్తుకొని అక్కడే కూర్చుని పెళ్లికూతురు రవణమ్మతో ఏమిటో అమితానందముతో మాట్లాడుతున్నది.

ఆ ఆనందములో లీనమయినవాళ్లు తన రాకనే గమనించినట్టులేదు.

కట్నకారులు తనవంక చూసే వెర్రి చూపులు తప్పించుకొని పెళ్లికూతురు సాన్నిధ్యం చేరడమే ఒకగగనమయింది దమయంతికి.

చుట్టూముట్టి కౌగిలించుకున్నంత పని చేసేరు స్నేహితురాండ్రు. సరోజ పరుగెత్తి కాఫీ, వుప్మా తీసుకొచ్చి దమయంతికి యిచ్చింది. ఉత్తికాఫీ మాత్రమే తీసుకొని కొంచముస్థిమిత పడ్డాది దమయంతి.

''ఏమే! ఒకరోజు ముందుగా రమ్మంటే ముహూర్తము పది నిముషాలు వుండనగా వచ్చేవ్?'' అంది రవణమ్మ.

మౌనముగా వూరుకొంది దమయంతి.

''దమయంతి సంగతి నీకు తెలుసుండికూడా ఎందుకే అలాఅడుగుతావు-తనకంటే నీకుముందుగా పెళ్లయిపోతున్నదని నీమీద

కోపమొచ్చిందే! అందుకే విధిలేక వచ్చి నట్టు వచ్చింది! అసలు రావడమే మానే సేదేమో!" అంది జానకి కొంచం వ్యంగ్యంగా దమయంతిని చూస్తూ.

ఈ మాట దమయంతిని నిశ్చయంగా నొప్పించింది. జ్ఞానములేకుండా నోటికి ఏది వస్తే అది మాట్లాడము దమయంతి మన స్థత్వానికే విరుద్ధం.

అయినా జానకికి ఎప్పుడూ ఒకరిని నొప్పించినట్టు మాట్లాడడం అలవాటు.

దీనికికూడా దమయంతి దగ్గరనుండి జాబాబు రాకపోవడంవల్ల మిత్రురాండ్రి బృందంలో ఒకవిధమయిన ఆశాభంగం కలిగి ఆ సన్నివేశాన్ని ఒక్క అరక్షణం దిగులుపరిచింది.

పురోహితుని కేకలు .... రవణమ్మ తల్లి రావడం ... రవణమ్మను తీసుకొని వెళ్ల డం జరుగడంవల్ల అందరితోపాటు తను కూడా వారిని అనుసరించింది దమయంతి.

మంగళసూత్రధారణ, మొదలుగాగల తంతు అంతా నిర్విఘ్నంగా జరిగింది.

రవణమ్మ భర్తనుచూసింది.. ఏమంత అందగాడుకాదు... పెద్దముక్కు ... నాట కాలవాళ్లలాగ పెద్దక్రాపింగు...ఏమయి తేనేం? రవణమ్మకి నచ్చేడు... ఈమాత్రం దానికే రవణమ్మ అంతగా తన భర్త గురించి పొగిడింది. ఒకమారు నవ్వుకుంది, దమయంతి.

రవణమ్మ .. ఆమె భర్త ఇంతమందిచుట్టు న్నారనే సంకోచము, జ్ఞానములేకుండా ఒకరి పక్క ఒకరు చూసుకోవడం నవ్వు కోవడం ... దమయంతికి ఆనందము కలి గించడానికి బదులు మనస్సులో చిన్న జుగుప్సను కలిగించేయి.

తనలో ఏదో "బలహీనత" వున్నట్టు ఫీలయింది దమయంతి. తను పెళ్లిపీటల మీద కూర్చున్నట్టు భ్రాంతిపడ్డది. అయితే అక్కడ తన ప్రక్క రవణమ్మ భర్త వున్నట్టు కనిపించింది. వ్యాకులతతో ఆ తలంపులన్నీ మనస్సులోంచి నెట్టేసింది!

ఎందుకో ఒకమారు అక్కడ కూర్చున్న మొగవారివైపు తన దృష్టి కేంద్రీకరించి చూసింది. వారిలో చాలమంది కళ్లు వివాహ తతంగం పక్క లేకుండా ఆడ వాళ్లమీదకే వుండడంచూసి దమయంతి అసహ్యించుకొంది.

ఎందుకో కొన్ని నిమిషాలపాటు ఆమెకు చెముడు, గుడ్డి వచ్చినట్టు ఫీలయి అక్కడ జరుగుతున్న తంతు ఏమీపట్టలేదు!

"వధువు మిత్రురాలు సుశీల, వధూ వరులకు వివాహ సందర్భములో ఈ టాయిలెట్ కేసు బహూకరించినారు" అని గట్టిగా అరచిన పురోహితుడి అరుపు

తనను మళ్లా ఈ ప్రపంచములోనికి తెచ్చింది.

అప్పుడుకాని స్ఫురణకురాలేదు దమయంతికి తను ప్రజంటుచేయడానికి ఏమీ తీసుకొనిరాలేదని.

ఆలోచించుకుంది తనలో! వెంటనే తన మెడలో నెక్లెస్ తీసి పురోహితుడి చేతిలోపెట్టి "ఒక మిత్రురాలు ప్రేమతో వధువుకు..." అని మాత్రం చెప్పండి చాలు అంది.

సుమారు రెండు వందలు రూపాయిలు ఖరీదుచేసే నెక్లెస్ ప్రజంటు చెయ్యడం అచ్చటవున్నయావన్మందిని దిగ్భ్రాంతు ల్నిగచేసింది. ఎంతబలవంతంచేసినా వుండకుండా, అందరి దగ్గరా శెలవుతీసుకొని ఇంటికి బయలుదేరింది దమయంతి.

పొంగి పొంగి ప్రవహిస్తున్న నదీ జలంలా జనసమూహం రోడ్డుమీద పారుతున్నాది. నొలుసులాగ కారులు, సైకిలు రిక్షాలు పోతున్నాయ్. చాల రిక్షాలలో వయస్సులోవున్న యువతీ యువకులు బుజాలు రాసుకుంటూ ఏమిటేమిటో కబుర్లుచెప్పుకుంటూ సాగిపోతున్న రిక్షాలను, కార్లనుగాని, ప్రవహిస్తున్న జనసమూహాన్నిగాని లక్ష్యంచెయ్యకుండా మొదటి ఆట సినీమాకు కాబోలు వెళుతున్నారు వెట్టి ఆనందములో!

ఎదురుగావున్న సైకిలురిక్షావాడు దమయంతి ఆలోచిస్తూ కుంటి నడకలు నడవడంచూసి "అమ్మా! రిక్షాకావాలా?" అంటూ రిక్షా లాక్కుంటూ దగ్గరకి వచ్చేడు.

మాట్లాడకుండా రిక్షాఎక్కి కూర్చుంది! ఇంటిగుర్తుచెప్పి పొమ్మన్నది.

వడిగాపోతున్న సైకిలురిక్షాలోంచి లోకం పోకడ చూస్తున్న దమయంతికి, ఈ లోక విచిత్రాలు, తాపత్రయాలు, మాయానాటకాలు చూస్తున్నకొద్దీ లోకం మీద, లోకంలోవుండే వ్యక్తులమీద అసహ్యత కలగనారంభించింది.

సాగుతున్న రిక్షా హటాత్తుగా ఆగడం గమనించింది దమయంతి! రిక్షావాడు దిగి ఛైయిను తప్పిందిలాగుంది దానిని సరిచేసి మళ్ళా తొక్కడం మొదలు పెట్టేడు.

రిక్షావాడిచేతిలో డబ్బులుపడేసి ఇంటి గుమ్మంఎక్కి ఇంట్లోకి నడిచింది దమయంతి!

హాలులో అన్నయ్య, మరెవరో ఒక కొత్త యువకుడు కూర్చొని ఏమిటో మాట్లాడుకుంటున్నారు.

టేబిలుమీద రేడియో తన పనిని చేసుకుపోతున్నాది. మద్రాసు న్యూసు వీళ్లు వింటున్నారో లేక వాళ్ల మాటలలో లీనమయ్యారో దమయంతి తెలుసుకోలేక పోయింది.

మాట్లాడకుండా నడిచి మేడమెట్లుఎక్కి తన గదిలోకి వెళ్ళింది దమయంతి. గది చీకటిగావుంది. స్విచ్ వేసింది !

సీతను పిలిచి కాఫీ తెమ్మంది. చీర మార్చుకుందామనుకుంది. మళ్ళా ఎందుకో అలాగే స్తబ్దుగా మంచంమీద వాలి పోయింది !

సీత కాఫీతెచ్చి బల్లమీద పెట్టి అక్కడే నిలబడింది – ఖాళీఅయితే కప్పు తీసి కెళ్ళేందుకు!

"వెళ్లు! ఇక్కడెందుకు నిలబడ్డావ్" అంది చిరాకుగా సీతతో. సీత మాట్లాడ కుండా మేడదిగి వెళ్లిపోయింది.

కాఫీ ఒక్క గుక్కతాగి అక్కడే మిగి లినకాఫీ వదిలివేసి ఆలోచిస్తూమంచం మీద పడుకుంది.

ఆత్రుతగా మెట్లెక్కి అన్నయ్య వచ్చాడు. "ఏం చెల్లాయ్! అలాపడు కున్నావ్ ?" లేచికూర్చుంది.

"ఉత్తినే అన్నయ్యా! ఏం ఇలా వచ్చేవ్ ?"

"చూడు ! నువ్వు వచ్చేసరికి నేను ఒకత నితో హాలులో మాట్లాడుతున్నానా ?"

"అవును"

"అతనెవరో నీకు తెలుసా ?

"అతనెవరో నాకెలా తెలుస్తుం దన్నయ్యా!"

"అతను నాస్నేహితుడు – ప్రభాకర రావు. ఇవాళే ఈ వూరు వచ్చేడు మద్రాసు నుండి. ఇంటికయినా వెళ్లకుండా సరాసరి ఇక్కడకే వచ్చేడు..."

"అయితే ?"

"ఆ! ఏంలేదు ... వాడితో చెప్పేను నువ్వు అద్భుతంగా పాడతావని!"

"అలాగా!"

(సశేషము)

# ప్రజలలోని జానపద సాహిత్య సేకరణ

శ్రీ ఎన్. సవుష్కినా

గ్రామసీమల్లోంచిపోతున్న ఆ దారికి ఇరువైపులా కనుచూపుమేరవరకు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు విస్తరించి ఉన్నాయి. దారికిపైన ఆకాశంలో పక్షులు యెగురుతున్నాయి. విద్యుచ్ఛక్తి తీగలు 'జాం' మంటున్నాయి. పంటభారంతో వంగిఉన్న చేలు గాలికి అటూ యిటూ ఊగుతున్నాయి. నది ప్రక్కన పొలాల్లో పంట నూర్చుతున్న స్త్రీలు తలకు కట్టుకొన్న రంగు రంగుల రుమాళ్లు రెపరెపలాడుతున్నాయి. సిజ్మాగ్రామం ప్రవేశించాము. వేసవి వేడికి అలసి కునికిపాట్లుపడుతున్నట్లున్నది గ్రామం. వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ప్రజలంతా పొలాలలో ఉన్నారు. అక్కడక్కడా కిటికీల్లోంచి ముసలమ్మల ముఖాలుతప్ప మరెవరూ కనబడడం లేదు. నేలలోంచి దొలుచుకువచ్చినట్లు వచ్చిపడ్డారు పిల్లలు. మా వెంట రాసాగారు.

"నటకులు వచ్చారు!"

కాని వాళ్లకు ఆశాభంగం కలిగించినందుకు విచారపడ్డాము. మేము నటకులముకాము. మాస్కో విశ్వవిద్యాలయంనుంచి జానపదగేయాల సేకరణ కొరకు వచ్చిన విద్యార్థులము మేము.

మాకు యిచ్చిన విడిదిలో సామాన్లు పెట్టుకొని వచ్చి వసారాలో కూర్చున్నాము. పొలాలనుంచి భోజనంకొరకు ఇంటికి తిరిగివచ్చిన యిద్దరు యువతులు మా దగ్గరకువచ్చి నిలబడ్డారు.

మేము జానపదగాథలు, గేయాలు సేకరించడానికి వచ్చామని తెలిసి వారు చిరునవ్వు నవ్వారు.

"అయితే సాయంత్రం రండి! అప్పుడు అన్ని పాటలూ పాడుతాము. వ్రాసుకోడానికి మీకు కాగితాలే సరిపోవు!"

పగటిపూట పెద్దవాళ్లు, యువకులు పొలాల్లోకి పనికివెళ్ళిపోతే వృద్ధులు మాత్రమే ఇండ్లవద్ద ఉంటుంటారు ఇంటిపనులు చేసుకొంటూ, పిల్లల్ని చూచుకొంటుంటారు. లేదా యెండలో చలికాచుకొంటూ ఇంటి ముందు కూర్చుంటారు.

సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో ఒక శిశుపోషణాలయం ఉన్నది. కాని కొందరు తల్లులు తమ పిల్లలను యెవరో ఒకరు ముసలాళ్లదగ్గర వదలివెళుతుంటారు. ముసలాళ్లల్లో కొందరు ఒక్కొక్కరు అయిదుగురు, ఆరుగురు పిల్లల విషయంశ్రద్ధ వహిస్తుంటారు.

ఒక యింట్లో ఒక వృద్ధురాలు ఉయ్యాల ఊపుతూ యిలా పాడసాగింది.

హుషా - హుషా - హుషాబై,
నిదురబోతండ్రీ నీవేడ్వబోకు,
ఏడిస్తె తోడేలు ఏతెంచు తండ్రీ,
కాలు చేతులు బట్టి ఈడ్చుకొని పోవు,
అడవిలోదానింటి కెత్తుకొనిపోవు,
నిదురబోతే నిన్నెవరు పట్టుకొని పోరు.

మారాకతో ఆప్రశాంత వాతావరణానికి భంగం కలిగిస్తామేమోనన్న భయంతో మేముగడపదగ్గరనే ఆగిపోయాము. కాని ఆమె మమ్మల్ని చూచింది. పాట ఆగిపోయింది. అయినప్పటికి మేము ఆపాటను అందరు తల్లులు, నాయనమ్మల ఉపయోగార్థం వ్రాసుకోటానికి నిశ్చయించుకొన్నాము. కొంతసేపు బ్రతిమాలిన మీదట కాట్యానాయనమ్మ మరికొన్ని జోలపాటలను వినిపించింది. ఒకపాటలోని విషయంయిది. ఇంటిలోని వాళ్ళంతా పనులలోనిమగ్నులై ఉన్నారు. కాని పాపాయి నిద్రపోవాలి. లేకపోతే "నిద్ర" "స్వప్నం" అతనిని స్వాధీనపర్చుకొంటాయి. పెద్దవాడయిన తర్వాత అతడు "బంగారు తొడుగులను

వేసుకొని స్వచ్ఛమయిన వెండిని ధరిస్తాడు." కాట్యా నాయనమ్మ స్నేహితురాలికి అనేక హాస్యపుపాటలు, భయంకరమైన జానపద గేయాలు, తమాషా అయిన జానపదగేయాలూ వచ్చును. పిల్లలు తమకు సుపరిచితమయిన జానపద కథలను, 'తెలివితక్కువతోడేలు, జిత్తులమారి నక్కనుగురించీ రైతులను వాళ్ళగొడ్లతో పాటు మ్రింగివేసిన మట్టి మనిషినిగురించీ శ్రద్ధతో వినసాగారు.

కొత్తగా మాకు పరిచయస్తులయిన స్త్రీలు, యువకులు మమ్మల్ని మంచిమంచికథలు చెప్పే ఐవాన్ కుజ్మిచ్ దగ్గరకు పంపించారు. చెప్పులు కుట్టే వృత్తి అతనిది. అతని యింటికి వెళ్ళేటప్పటికి తలుపుతాళం పెట్టిఉన్నది. అతడు వచ్చేవరకు కాచుకొని ఉండడానికి నిశ్చయించుకొని ప్రక్కనే ఉన్న ఒక బండరాతిమీద కూలబడ్డాము. కొద్ది సేపయ్యాక ఒక గొడ్డలి భుజాన వేసుకొని ఐవాన్ కజ్మిచ్ వచ్చాడు. అడవినుంచి వస్తున్నాడతడు. మేము వెళ్ళిన పనిని గురించి తెలియజేయగానే లోపలికి ఆహ్వానించాడు. ఇంట్లోకి వెళ్ళాక కుజ్మిచ్ చెప్పులుకుట్టే పరికరాలను ప్రక్కకుసర్ది, పడకకుర్చీలో కూర్చొని మాస్కోను గురించి మాట్లాడసాగాడు. కాని మాకు తెలియకుండానే మాసంభాషణ జానపదకథలమీదికి మళ్ళింది.

"మీరు మాస్కోవాసులేగదా, మీకు మాస్కోలోని గ్రిబెన్కిన్ అనే ఒక వర్తకుని కథ తెలుసా? తెలియదూ? అయితేవినండి..."

కొద్దిసేపట్లో ఇల్లంతా పిల్లలతో నిండిపోయింది. కొందరు తోటలో కిటికీకి సమీపంలో నిలబడ్డారు. అందరికీ వినబడేటట్టు చెప్పసాగాడు. దారినిపోతున్న కొందరు సైనికులుగూడా వినసాగారు. ఇంటి యజమానురాలు గడపదగ్గర నిలబడి వింటున్నది. ఆమె ముఖం గంభీరంగాఉన్నా, హృదయం గర్వపడుతున్నట్లు తెలుస్తూనే ఉన్నది.

"వీళ్ళంతా చుట్టపొగతో ఇల్లంతా యెలా నింపేస్తున్నారో చూడండి!" అని గొణుక్కొన్నది.

"ఎంత పొగపడితే అంతకాలం గట్టిగా నిలుస్తుంది ఇల్లు. నా మట్టుకు నేను చుట్టపొగ బాగా త్రాగిఉన్నవాడ్ని గాబట్టి యెంత కాలమయినా బ్రతుకుతాను" అన్నాడు పరిహాసంగా, కుజ్మిచ్,

"పోయిన చలికాలంలో మీరిక్కడుండాల్సింది. మీ తనివితీర కథలు వినిఉండేవారు."

కాని ఇంకా చెప్పవలసిన కథలు యెన్నో ఉన్నాయి. వెఱ్ఱి సైనికులను గురించీ, దురాశపరులైన మతగురువుల గురించీ, సామాన్యరైతుల గురించి కథలు అనేకం చెప్పాడతడు. కుజ్మిచ్‌కు వందల కొలది కథలు గుర్తున్నాయి.

"సరే, ఊళ్ళో అందరికంటే చక్కగా పాడేవాళ్ళెవరు?"

పాటలు కావాలంటే మేము ప్రక్క గ్రామంలో ఉన్న గ్రిష్చేవ్ అప్పచెల్లెళ్ళనే వినాలని అందరూ ముక్తకంఠంతో చెప్పారు.

"వాళ్ళనే వినాలి, బాగా పాడతారు. ఎవ్వరికీ అన్ని పాటలురావు!"

గ్రిష్చేవ్ అప్పచెల్లెళ్ళు డెబ్భయవపడిలోఉన్న వాళ్ళు. చిన్నప్పటినుంచి వాళ్ళు పాటలకు ప్రసిద్ధిగాంచారు. ఈ నాటికిగూడా వాళ్ళ పాటలు వినడానికి జనం వాళ్ళింటికి వెళుతుంటారు. హాస్యపు పాటలంటేను, వేట, నృత్యపు పాటలంటేను వాళ్ళకు చాలా యిష్టం. వాళ్ళ యౌవనాన్ని గుర్తుకు తెచ్చేట్లు నృత్యంచేస్తూ పాడసాగారు. వాళ్ళ పాటలు వినడానికి జనమంతా చుట్టూ మూగారు. పాటలు ఆపినప్పుడు అక్కడచేరిన వృద్ధులు సామెతలు చెప్పుకొంటూ ఒకరిమీద ఒకరు విసుర్లు వేసుకొనేవారు.

మేము అవన్నీ సేకరించాము. ఈ సేకరణకు మన రచయితలు మాకు యెంత కృతజ్ఞత చూపాలి!

జానపదగేయాలలోని తేటతనము, భావ ప్రకటన, భాషలోని మాధుర్యము రచయితలకు చక్కని మార్గాన్ని చూపగలవు. పోలకోవ్, త్వార్దొవిస్కీ,

ఇసకోవిస్కీ–లు జానపద సాహిత్యంలోని విషయాలు అనేకం పరిగ్రహించి, దాని సంపదను పెంపొందించారు.

రాత్రి పడసాగింది. సమిష్టిక్షేత్ర రైతులు ఇండ్లకు చేరసాగారు. రోజల్లాపడిన శ్రమనుండి విశ్రాంతి పొందడానికి తయారుకాసాగారు. చక్కని దుస్తులు ధరించిన యువతీ యువకులు వీధుల్లోకి చేరుకొన్నారు.

యువతులు జట్లుగాచేరి వీధుల్లోంచిపోతూ తమను గురించీ, తమ ప్రియులను గురించీ, తమ సుఖ దుఃఖాలను గురించీ పాటలు పాడుకొంటారు.

ఈ పల్లెపదాలు రోజూ కొత్తవి తయారవుతూనే ఉంటాయి. వాటి కథావస్తువుయేమిటి? పల్లె ప్రజల జీవితంలోని సుఖదుఃఖాలే వాటి కథావస్తువు. ఈ పల్లె పదాలలో ఉత్తర రష్యన్ ప్రకృతి దృశ్యాలూ, నదుల వర్ణనా ఉంటాయి.

కాని మరొక విధమయిన పల్లెపదాలుకూడా ఉన్నాయి. సోమరిపోతులనూ, అసమర్థులయిన సమిష్టిక్షేత్ర రైతులనూ ఆ పదాలు ఎగతాళి చేస్తుంటాయి. సమిష్టిక్షేత్రపు లోపాలను విమర్శిస్తూ ప్రవీణులైన కార్మికులను ప్రశంసించే యీ పదాలు "గోడపత్రికల" లాంటివి. ఉదాహరణకు, దళం నాయకుని భార్య పనికిరాకపోయినందుకు ఆమె సోమరితనాన్ని యెగతాళిచేస్తూ ఒకపాట కట్టబడింది. క్లబ్బు నిర్మాణంపని ఆలస్యమయినప్పుడు గ్రామ యువజనులు ఒక పాటను కట్టారు. అందులో దూలాలు తమ దురవస్థను చెప్పకొని యేడుస్తాయి.

యువతులంతా ఒక వలయాకారంలో నిలబడ్డారు. ఇద్దరో లేక నలుగురో వలయం మధ్యకు వచ్చి నృత్యంచేయ నారంభించారు. వాళ్లు వెళ్ళిపోగానే తక్కినవాళ్లు వాళ్ళ స్థానంలోకి చేరుకొనసాగారు. రాత్రి చాలాకాలం గడిచేవరకు ఈ వేడుక కొనసాగుతూనే ఉన్నది. సోవియట్ కవుల పాటలను, ప్రాచీన జానపదగేయాలను వాళ్ళు పాడుతున్నప్పుడు మేముకూడా వాళ్ళతో కలసి పాడాము.

ఈ లోగా మా సహచరులు కొందరు, ఈడుపైబడ్డ స్త్రీలంతా చేరిన ఒక యింటికివెళ్లి తమకు సాధ్యమైన పాటలు, ఇతర విషయాలు సేకరింపసాగారు. ఆ స్త్రీలంతా తమ అల్లిక వస్తువులతో సహా అక్కడ చేరుకున్నారు. (ఈ ప్రాంతం అల్లిక లేసులకు ప్రసిద్ధిగాంచింది.)

వృద్ధులు విషాదకరమైన పాటలంటే యెక్కువ యిష్టపడతారు.

"వసంతం, వేసవీ, తిరిగి వసంతం,తో
కదలిపోయింది కనకపు కాలం,
ఉల్లాసంగా, వేడుకగా,
కన్నారాకాలం పోకడ, పిల్లల్లారా"

ఆ పాటలో ముగ్గురు కంఠస్వరాలు వినబడసాగాయి. చిన్నవయస్సు దానిలాగ కనబడే నలభై అయిదు సంవత్సరాల నల్లకళ్ల అలెగ్జాండ్రా ఐవనోవా కంఠం అందులో ప్రస్ఫుటంగా వినుపిస్తున్నది. ఈమెకు పాటలంటే మహా యిష్టం. పాటల గురించి బాగా తెలుసుకూడా. తన జీవిత సర్వస్వం పాటలేనని అంటుంది. గ్రామంలోని సమిష్టి వ్యవసాయక్షేత్రం క్లబ్బులో బృందగానానికి అలెగ్జాండ్రా ఐవనోవా నాయకత్వం వహిస్తుంది. ఆ బృందగాన దళం ప్రక్క గ్రామాలకుగూడా వెళ్ళి పాడుతుంది.

ఈ పాటలకు అంతే కనబడలేదు. అవన్నీ వ్రాసుకోడానికి నిజంగానే మా దగ్గర కాగితాలు చాలవేమోనని భయం వేయసాగింది.

—(౦)—

# శ్రీ రామ కర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గతసంచిక తరువాయి)

౨౧

మాకు దైవంబు, రఘుకుల శ్రీకరుండు
ప్రీతి దైవంబు, రఘువంశసూతి మాకు
భరతు సోదరుఁడే, మాదు ప్రభువరుండు
రాముఁడే, భగవంతుండు; రాముఁడలఁతు.

౨౨

నీలోత్పల శ్యామ నిర్మలాంగమువాఁడు
జానకీ మానస శశధరుండు
శాంతంబుగల్గిన సత్య స్వరూపుండు
నిర్మల గుణముల నెగడువాఁడు
పూఁదోఁట కరణిసొంపుల నింపుగూర్చు, మ
నోహర రూపుండు మోహనుండు
ధ్యానంబుఁజేసెడి, మానులమానసం
బను సరోవరమున యాడునట్టి
హంసమైయున్న శ్రీరామ! శంసనీయ!
అందమైనట్టి తేజము నందినావు!
ఘోర సంసారబాధలఁ గూల్చిరామ!
మానసానందమిమ్ము; రమావినోద!

౨౩

మందారవృక్ష సమ్మానితమైనట్టి
మంటప మందులో మహితమైన
కనక పుష్పకమొందు, కమనీయమైయొప్పు
నందొక్క సభయుండు, నందురతన
సింహాసనంబుండు, సీతామహాదేవి
తో, లక్ష్మణునితోడ లాలితముగ
శ్రీరామచంద్రుండు సెలువారు నింద్రాది
దేవతల్ సేవింప దివ్యభక్తి;
పద్మనేత్రుండు, శ్రీరామ భద్రుఁడమల
మైన, నీలోత్పలామల శ్యామవర్ణుఁ
డెపుడు మునిసమూహములచే నెసగువాఁడు
నాదు మ్రొక్కులఁ గొనుగాత సాదరమున.

౨౪

నీల నీరదగాత్ర! ప్రవాళపాద!
ప్రవిమల, మునిమానస సరో రాజహంస!
ముగ్ధవనితా మనోమోహ మూలమంత్ర!
కమలనేత్ర! శ్రీరామ! రక్షణమునిమ్ము.

౨౫

చాలు వాదంబు, శ్రీరామ చంద్రమూర్తి
నరుఁడుగాడు సుమీ! నిశాచరులఁజంప
శేషశయ్యనువీడి విచ్చేసినట్టి
ఆదినారాయణుఁడు సుమీ! యతనిభక్తి
సేవఁజేయుడి జనులార చిత్తమందు.

౨౬

దశకంఠ కంఠముల్ ధ్వంసం బొనర్చిన
లోకరక్షకుఁడవు, ప్రాకటముగఁ
బరశురాముని గర్వ భంగం బొనర్చిన
ధీర మూర్తివి నీవు, ధీసమేత!

లంకేశుపుర మహా లంకారములనెల్ల
నేలమట్టము జేసి నెగడినావు
జానకీదేవితో సల్లాపములనాడి
యామె పాపటఁదిద్దు ప్రేమమూర్తి
వమల ధనువును జేఁబట్టి – యఖిలదుష్ట
జనుల శిక్షించి, భూభారమును హరించి
రామ వెలుగొందుచున్నావు ; రత్నమకుట
ధారి ! కోదండధారి ! కైదండనిమ్ము,

౨౭

బ్రహ్మాదియోగులు, రామమంత్రమునెప్డుఁ
బూజించుచున్నారు పుణ్యబుద్ధి
మానులు శ్రీరామ మంత్రంబు సతతంబు
జపియించుచున్నారు సత్యమెఱఁగి
దారిద్ర్య దుఃఖాబ్ధిదాటగా శ్రీరామ
మంత్రంబుఁ జింతింత్రు మనుజులెల్ల
భవరోగమును, నాశపఱుపగా – శ్రీరామ
మంత్రంబు సేవింత్రు మానవాళి

తలఁప సంసార సాగర తారణంబు
సలిపి, భయహార మొనగూర్పఁ జాలినట్టి
మహిమఁగల్గిన శ్రీరామ మంత్రమునకు
సాటియున్నదే? మఱియెందు జగమునందు?

౨౮

శత్రుసంహారంబు సల్పెడు మంత్రంబు
సంసారమను దుఃఖసాగరంబు
దాటించు మంత్రంబు, సూటిగా జన్మసాఫ
ల్యంబు నొడగూర్చు పరమ మంత్ర
మన్నిమైశ్వర్యంబులందు ముఖ్యపు
మంత్రము వనిషగ్వాక్య సంపూజ్యమంత్ర
మారయద్యూతాది వ్యసనంబు లనబడు,
పాముచేఁ గఱవంగబడినయట్టి
వారి రక్షించు మంత్రంబు, వసుధఁ బాప
రాశిఁబోగొట్టు మంత్రంబు రామ మంత్ర
మట్టి మంత్రంబు నా జిహ్వ యధికభక్తి,
సంస్తుతి నొనర్చుగాత ! విశ్రాంతిలేక.

౨౯

వింటిని చెవిపర్యంతంబు వేడ్కతోడ
లాగి, బ్రహ్మాస్త్రముందొడ్గి లావు మెఱయ
రథము నారోహణ మొనర్చి, రణమునందు
ధీరుఁడై, రావణునిజంపి, శ్రీ రఘూత్త
మా! మెఱుపు దామరలబోలి సోయగంబు
తోఁ బ్రకాశించు నీ కనుదోయిఁజూడు,
భయముగల్గెడి శ్రీరామ! అభయమిమ్ము

౩౦

కమనీయ దశకంఠ కంధరకదళికా
కాంతారకాంతి సంక్రాంతమయ్యె
జనకజా స్తనయుగ చర్చిత చారుకుం
కుమ గంధరక్తిమ కొమరుమీఱె
సకల సజ్జన ప్రాణ సంత్రాణకారణ
వరశౌర్య గరిమచే వాసికెక్కె
విశ్రాణనాతుల విభవయజ్ఞారంభ
యూపాయతంబులై యుర్వినెగడె
రాముకరములు ; శోభాకరములు, పాప
హారము, లతుల శుభంబైన వరములట్టి
కరములను దినమిచ్చు సుఖంబుభక్త
వరుల కనురక్తితోడ, సంబరముమెఱయ.

(సశేషము)

# అభాగిని

'పల్లపోతు'

తెల్లవారింది. భానుడు తన అంబుల పొదితో వేటకు సంసిద్ధుడయ్యాడు; అతనిరాకకు ఆహ్వానాలు అందజేస్తున్నట్లుగా వేడిగాడ్పు లారంభమయ్యాయి; ప్రకృతి పడతిని పొందనున్న భానుడు ఆనందముతో ఆ ఆహ్వానాలు అందుకుంటున్నాడు.

పెళ్ళికి ముస్తాబైన పద్మ అదృశ్యాన్ని చూస్తూ అలాగే నిలబడింది. వేదనారేఖలు పొడసూపుతూ మొఖం నల్లగా వాడిపోయింది. ఒంటరిగానున్న పద్మ హృదయం ఆలోచనాతరంగాల్లో, బుడగలు తేస్తుంది. పద్మకు జీవితమంతా అగమ్యగోచరంగాకన్పించింది. తన అందమంతా అడవిగాచిన వెన్నలయింది; తన యవ్వనం ఎడారిలో మాలతి;

"చదువు సంధ్యల్లో, గుణగుణాల్లో, అందచందాల్లో పద్మకు పద్మే సాటి! పద్మ అదృష్టవంతురాలు!" అని ఎంతోమంది అన్నారు. అవును— రూపవతి, గుణవతి, విద్యావంతురాలు కావటమే అదృష్టమయితే పద్మ నిజంగా అదృష్టవంతుల్లో అగ్రగణ్యురాలయ్యేది; పద్మకు భగవంతుడు చదువూ, అందం, తెలివితేటలూ అన్నీ ఇచ్చేడు; అయితే ఏం లాభం? ... వాటికి తోడుగా చిన్నలోటుగూడా కల్పించేడు; అది తలచుకున్నప్పుడెల్లా పద్మ హృదయం జేవురించేది; అదిజ్ఞప్తికి వచ్చినప్పుడెల్లా పసిపాపవలె ఏడ్చేది; తన ఒంటరి జీవితాన్ని గూర్చి ఆలోచిస్తే పద్మగుండె బ్రద్దలయ్యేది. పెండ్లయిన ప్రతిపడతితోనూ పోల్చుకుని కుమిలిపోయ్యేది; లేత తమలపాకువంటి శరీరచ్ఛాయ; కొనతేరిన ముక్కూ, అరటాకులాంటి సున్నని పెదవులూ, లేతగులాబీల్లాంటి సన్నని చెక్కిళ్ళూ, నిముషనిముషానికీ నుదిటపై నాట్యంచేసే ముంగురులూ 'అచ్ఛంగా అపర దేవకన్యలావున్న తన సుందరాకృతిని చూసి ఉప్పొంగిపోయ్యేది... కానీ, ... ఆవిడకు దైవం కల్పించిన స్వల్పలోటు ఆ సుందర కోమలాంగి హృదయాన్ని ఛిన్నాభిన్నాలుగా చేసేది.

"... పొరుగింటి పుల్లమ్మగారమ్మాయికి పొట్టపొడిస్తే అక్షరంముక్క లేదు; దాని మొగుడు బి. ఎ. పాసయ్యాడు ... నా స్నేహితురాలు విమల వట్టి పిచ్చిది ... నీలమేఘచ్ఛాయను వెక్కిరించే, కారు మేఘల్లాంటి మొఖం; తెలివితేటలా నూన్యం— దాని భర్త యం. ఏ. పాసయ్యాడు... నాకు ప్రతి మగవాడు కోరుకునే లక్షణాలన్నీ ఉన్నాయి. మరి నాకిదేం ఖర్మ? ... నేనేం పాపం జేసుకున్నాను. దేనికైనా పెట్టిపుట్టాలి; ఇంతకీ అదృష్టం ఉండాలి!" అనికుమిలి పొయ్యేది.

తీరని కోరికలు ఆవేశంలో బుసలు కొట్టేవి త్రాచు పాముల్లా;
ఆరని ఆశలు అంతంలేని అంటు వ్యాధిలా వ్యాపించినవి;
మారని ఆశయాలు మనస్సులో బాణల్లా నాటుక పోయినవి;

... పెళ్ళికి వచ్చిన పేరంటాల్ల పక, పకలు తనను పరిహాసిస్తున్నట్లుగాతోచింది పద్మకు; హృదయంలో బ్రద్దలయ్యే అగ్ని పర్వతాలను, బాధగా బరువుగా ప్రవహించే కన్నీటిధారలతో ఆర్పేసుకుంది;

♦ ♦ ♦

పెండ్లి పందిరంతా పిన్నల, పెద్దలతో కళ, కళ

లాడుతుంది; వరుడు స్నేహితులకు ఆహ్వానాలిస్తున్నాడు; పద్మ చూపులు బారులు తీరిన యువక బృంధంపై కేంద్రీకరించాయి; ముఖ్యంగా బులుగు రంగు బుష్ షర్టునుధరించిన యువకునిపైనుండి దృష్టిని మరల్చాలంటే బాధగా వుంది పద్మకు ... ... అతనెక్కడో చూచినట్లుగా జ్ఞాపకం! అతనెవరు ? ... నేనెక్కడ చూసేను? ... అబ్బ! ఎంత చక్కగా వున్నాడు! ... అతని సౌందర్యాన్ని చూస్తుంటే నా ఒళ్ళు జలదరిస్తుంది. అతనికీ, నాకు ఏమిటి సంబందం?

పద్మ మనస్సులో సముద్రతరంగాల్లా ఆలోచనలు దొర్లినయ్!

'ధన, ధన' మని వాయిద్యాల మోతకు ఉలిక్కిపడి పద్మ మళ్ళా ఈ ప్రపంచంలో పడింది;

తనేం చేస్తున్నా, ఎంతమందిలోవున్నా ఏవో రెండు విశాల నేత్రాలు తనను వెదుకుతున్నాయనీ బులుగురంగు బుష్‌షర్టు గమనించకపోలేదు;

◆ ◆ ◆

ఒకరి నొకరు చూచుకోవటం పెదవులపైకి చిరునవ్వు దెచ్చుకోవటం, కాస్త హృదయాలను తేటబరచుకోవటం ... ఇది ప్రతినిముషమూ జరుగుతుంది; చిలిపిగా పద్మ కనుగవతో ఏదో బాసలాడుతున్నాడు; సన్నజాజులు కురిసే మందహాసంతో పద్మహృదయ వీణాతంతులను మీటి, అపూర్వమైన అమరగీతితో ఆమె వీనులకు విందుగొలుపుతున్నాడు; ... ఆనంద డోళికల్లో నూగుచున్న పద్మహృదయం ఒక్కసారిగా గగుర్పొడిచింది; ... ఎంత ధైర్యం! పెద్దపరిచయమున్నవాడిలా "పద్మా!" యని పేరు పెట్టి పిలుస్తున్నాడే! ఆహాఁ! ఎంత కమ్మని కంఠస్వరం! ... ఏనాడో ఎక్కడో పరిచయమున్న కంఠధ్వనిలావుంది; ... అతని సాహసానికి ఆశ్చర్యపడింది పద్మ! ఏదో భయంవేసింది; ... తన గదిలోకి వెళ్ళింది ఒక్క పరుగుతో, నిలువుటద్దంముందు తన సౌందర్యాన్ని చూసుకుని సిగ్గుపడింది; అద్దంలో అతని ప్రతిమ పక, పకమంది; ... మీరెవరండీ? ... ఎందుకు నవ్వుతున్నారు? ... నేనందంగాలేనా? ... ఎవరోవస్తున్నశబ్ధం పద్మ సంభాషణను నాశనం చేసింది; అతను పద్మను సమీపించేడు. భయంగా కళ్ళుప్పగించి నిల్చుంది. ... "పద్మా!" అన్నాడు నవ్వుతూ;... శిలాప్రతిమయింది పద్మ! ... "నాగేశ్వరం ... నువ్వేనా? ... నిజంగా నువ్వేనా?"... అంటూ అతని హృదయంలో తలదాచుకుంది; "ఇప్పుడు గుర్తించావా? పద్మా!" అంటూ తన హృదయానికిగాఢంగా హత్తుకున్నాడు.

రాత్రంతా తన అనిలా అంతస్థుల్లో విచ్చలువిడిగా విహరించినందుకు సూచనగా ఉదయ భాస్కరుని లేత కిరణాలు సూటిగా మొఖంమీద నాటేవరకూ మెలుకువరాలేదు పద్మకు; భారంగా పడకమీదనుండి లేచి వళ్లు విరుచుకుంది; అద్దంలో తన అందాన్ని చూచుకుని కిలకిలమంది; గోడనున్న రాధాకృష్ణులను వెక్కిరిస్తూ బయటకొచ్చిన పద్మ మొఖం వాలిపోయింది. "రాత్రి మొయిలెక్కబోయి పొరపాటున బండిక్రింద పడి నాగేశ్వరం మరణించా"డన్న వార్త వినగానే ఆమె హృదయం గతుక్కుమంది;

మిణుకు, మిణుకుమని వెలుగుతున్న ఆశాజ్యోతి "టప్పు" మని ఆరిపోయింది. పద్మహృదయం నిశ్శబ్ధంగా రోదించింది.

---

# 10-కి 15

# 20-కి 30



ఇది నిజం. ఇందులో ఇంద్రజాలం ఏమీలేదు. మీరు నేడు నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లతో పది రూపాయలు దాచుకుంటే, పన్నెండు సం॥ల తరువాత, మీకు పదిహేను రూపాయలు లభిస్తాయి. మీ డబ్బు సురక్షితంగా ఉంటుంది. వడ్డీకి ప్రభుత్వ హామీ ఉంది.

## • రెట్టింపు లాభం

మీరు దాచుకున్న డబ్బు పంచవర్ష ప్రణాళికక్రింద నానా యోజనాల నిర్మాణంకొరకు ఖర్చు చేయబడుతుంది. ఈ నిర్మాణాలతో దేశమొత్తము యొక్క ప్రజాజీవిత ప్రమాణం పెరుగుతుంది. వడ్డీతోపాటు సమస్త ప్రజానీకముయొక్క పురోభివృద్ధిలో భాగంకూడా మీకు లభిస్తుంది. ఇదికాక, మీరు



# నవభారత నిర్మాణంకొరకు తోడ్పడుతారు

ఇతర వివరాలకు మరియు లేక ఈ దాస్తానాల గురించిన నియమావళికొరకు దయయుంచి నేషనల్ సేవింగ్స్ కమిషనర్, సిమ్లా లేక మీ రాష్ట్రముయొక్క రీజనల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసరుగారికి వ్రాసుకోనండి.

DA 56/151-T0

# వందేమాతరం

శ్రీ వడ్డూరి అచ్యుతరామయ్య



వందే భారతమాతరమ్ ॥
వందారు జనసుర మందారమ్ ॥ వందే ॥

మందరాచలవింధ్య హిమగిరి సుందరోన్నత శిఖరచుంబిత
చంద్రతారక మండలాం – సాంద్రఫలతరు మండితాం ॥ వందే ॥

గౌతమీ కావేరి (రీ) గంగా – కృష్ణవేణి (ణీ) తరంగ రంగన్
మంగళోదక పోషితాఖిల భూతజాల విభాసినీం ।
పాతకౌఘ వినాశినీం ॥ వందే ॥

అంగ వంగ కళింగ కర్ణాటాంధ్ర ఘూర్జర ద్రవిడ మండల
సంగరాంగణ విజిత రిపుజనవీర హిందూబృందవంద్యాం ॥ వందే ॥

లలిత – కుసుమిత – ఫలిత – విలసిత – సస్యతరులతపల్లవాం
కిలకిలారవ ఝుంకారితకలని నాదపతంగ బృందాం ॥ వందే ॥

చంద – నాగరు – పారిజాత – మందార – కుంద – కమల – సు
గంధ బంధురమందానిల కందళిత హృదయారవిందాం ॥ వందే ॥

చతుష్షష్టి కళాన్వితాం – చతుర్వేద నివేదితాం
చతుస్సాగర వేల్లితాం – చతురంగబలోపేతాం ॥ వందే ॥

శాంత-శమ-దమ-నియమ-వితరణ-సత్య-శౌచ-దయార్ద్ర రక్షణ
ధీర గంభీరాది సుగుణ గణాభిరామ కుమార సహితాం ॥ వందే ॥

వ్యాస వాల్మీకి కాళిదాసా మరమయూర శుకాది కవికుల
భాసమాన మహాకవిత్వ సుధాతరంగ సురంజితాం ॥ వందే ॥

కృష్ణ శంకర బుద్ధ గాంధీ రామ కృష్ణ సుబోధామృత
రసప్లావితమానవౌఘామ్, విశుద్ధాంచిత కర్మబద్ధామ్ ॥ వందే ॥

ధర్మ సత్య దయాశ్రితావన ద్వాత్రింశత్సుగుణ భూషిత
రాజ రాజాధిప మహారాజ భుజపరిపాలితాం ॥ వందే ॥

ఋగ్యజుస్సా మాథర్వణ శ్రుతి స్మృతి సుపురాణోదిత
వాదగాథా బోధితాం - వేదనాద వినోదితాం ॥ వందే ॥

సరిగమా పాదాని సంయుతసప్త స్వరగాన లోలాం
తధిమిధిమికిట ధణం ధణముఖ తాళబంధుర నటనఖేలా ॥ వందే ॥

కమలదళ సన్నిభవిలోచన కమలకే సరవర్ణినీం
కమలభవముఖ వినుత సుచరణ కమలయుగళ విభాసినీం ॥ వందే ॥

అభయముద్ర త్రివర్ణకేతన - శూల - కమల - కరాంబుజాం
విబుధలోక సమర్చనీయ సుదివ్య మంగళ విగ్రహాం ॥ వందే ॥

ప్రాచ్య పాశ్చాత్యాది భూతల భాసమాన శిరోరత్నాం
అచ్యుతార్చిత చరణ పద్మాం - నిత్యఫలిత సురత్న గర్భాం ॥ వందే ॥



"సౌత్ ఇండియా ఆఫీసు : 5/149, బ్రాడ్వే, మద్రాసు 1."

# పుట్టబోయే శిశువులు

శ్రీమతి యం. లక్ష్మీదేవి



(ఇంట్లో సావిట్లో రమణ కొందరు బాలురతో పడికట్టుకొని ఆడుకుంటూంటాడు. సుమారు ఏడేళ్ళ వాడు. చిన్న రాతిముక్కను దేవుడిలాగ పెట్టుకొని పూలు, పళ్ళు వాటిముందుంచి పాడుతూంటారు.)

అందరు:_రఘుపతి రాఘవ రాజారాం; పతిత పావన సీతారాం;
ఈశ్వర అల్లా తేరేనాం; సబ్‌కో సన్మతి దేభగవాన్
రామ రామ జయ రాజారాం; రామ రామ జయ సీతారాం ||

(రమణ తండ్రి స్నేహితుడు సుబ్బారావు వస్తాడు)

సుబ్బారావు:_రమణా! మీ నాన్న ఉన్నాడా ఇంట్లో?

రమణ:_ఎవరూ! మీరా! రండి. నేను చూడలేదు.

సు:_నువ్వేం జేస్తున్నావు ఇక్కడ?

ర:_మేమంతా కలిసి భజన చేస్తున్నామండీ - మా దేవుణ్ణి చూశారా?

సు:_(సమీపించి) దేవుడా! ఏడీ?

ర:_ఇదిగో, చూడండి.

సు:_(చూసి) బాగుంది. రాతిముక్కను పెట్టుకొని ఇదేమిటీ ఆట! చక్కగా ఆరు బైటికెళ్ళి బంతులాడుకోరాదూ!

ర:_దేవుణ్ణి పెట్టుకొని ఆడితే ఏం?

సు:_(కోపంతో) బాగుంది. దేవుడూ. నువ్వా! ఛీ! పద. ఎవరు చెప్పారు నీకు ఈ ఆటలాడమని! ఈ వయసులో దేవుడేమిటీ! దయ్యమేమిటి!

ర:_కోప్పడకండి. మామయ్యగారూ! మరి నా అంత ఉన్నప్పుడేగా ప్రహ్లాదుడుగూడ దేవుడాట ఆడుకొనేవాడు!

సు:_అదంతా పురాణకాలం. ఆ చచ్చు కథలంతా ఎక్కడ విన్నావు?

ర:_ఎక్కడా వినలేదండీ, మా పాఠ్య పుస్తకంలోనే చదివాను. అతనిలాగే నేనూ భజనచేసి దేవుణ్ణి చూస్తాను.

సు:_ఏడిశావ్! ఎక్కడున్నాడురా దేవుడూ! దేవుడూలేదు గీవుడూలేదు. ఆ పాఠ్య పుస్తకాల్లోని పాఠాలంతా చదవటానికేగాని అలాగే చేయడానికి కాదు.

ర:_మరి ప్రహ్లాదుడు నిజంగా దేవుణ్ణిచూశాడే! వాళ్ల తండ్రికి చూపెట్టాడుగూడ. మరి ధ్రువుడు కూడా అంతేగా, వాడూ దేవుణ్ణి చూసినవాడే!

సు:_చూడుమళ్లీ నీ ప్రసంగాన్ని మానవుకదా! అదంతాపాత కాలం. ఈ కాలంలో ఎవ్వరూ దేవుణ్ణిచూడనూలేరు. చూపించనూ లేరు.

ర:_ఈ కాలంలో మాత్రం దేవుణ్ణి చూడలేరని మీరెలా చెప్పగలరూ! మా పాఠంలో శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానంద ఇటువంటివారుగూడ దేవుణ్ణి చూసినట్లు వ్రాసివుందే! మీరు చూడలేదేమో!

సు:_ఓరీనీ! తెగచంపుతావే! వాళ్ళంతా మహానుభావులురా. మహానుభావులు.

ర:_అయితే నేనూ అలాగే అవుతాను. నేను ప్రహ్లాదుడిలాగే దేవుడి ఆటలు ఆడుతూ పాడుతూ ఉంటే నేనూ దైవభక్తుణ్ణి అవుతాను.

సు:—ఓరి కుఱ్ఱ వెధవా! దేవుడంటే ఏమిటో తెలుసట్రా నీకు?

ర:—ఓ తెలుసు,

సు:-వాడెక్కడుంటాడు ?

ర:—అన్నిచోట్లా ఉంటాడు. "కలడందురన్ని యెడలను" అని పోతన కవి పద్యం చెప్పాడుగా!

సు:—పోనీలే, నీకు కనబడ్డాడా!

ర:—ఓ!

సు:—ఎక్కడా ?

ర:—అన్నిచోట్ల, ఇదిగో ఈ రాతిముక్కలోగూడ.

సు:-అయితే నాకీస్టూలులో చూపెట్టు చూద్దాం! (అని తన చేతికఱ్ఱతో స్టూలును బలంకొద్ది కొడతాడు. స్టూలుకు అడుగు భాగంలో ఉన్న ఒక తేలు చప్పున క్రిందపడింది. పరుగెత్తుకొంటూ సుబ్బారావు పాదం దగ్గరికొచ్చి తక్కున కుట్టింది)

సు:—అయ్యో! బాబోయ్! చచ్చానురా బాబూ! తేలు! తేలు! తేలు కుట్టింది. అలా చూస్తారేం కుఱ్ఱకుంకల్లారా! దాన్ని చావగొట్టండిరా!

(అందరూ గాభరాపడి లేస్తారు. తేలు మాయమైపోతుంది) కనబళ్ళేదండి తేలు! ఎటో వెళ్ళిపోయింది.

ఒకడు:—మీరు దేవుణ్ణి చూపెట్టమన్నారు గదండీ! అదే దేవుడేమో!

సు:—అయ్యో! అయ్యో! నొప్పి! నీ తలకాయ! దేవుడట! దేవుడు.

ర:—అవును మామయ్యా! దేవుడు దుష్టులను శిక్షిస్తాడు. శిష్టులను రక్షిస్తాడు.

సు:—చాల్లేవయ్యా! నీ వేదాంతాలూను, నువ్వూను. ఇక్కడ ప్రాణంపోతూంది. అయ్యో! అయ్యో! (ఇంతలో రమణతండ్రి ప్రకాశంగారు వస్తారు)

ప్ర:—అదేమిటండీ! సుబ్బారావుగారూ! కాళ్లు పట్టుకొని బాధపడుతున్నారు?

సు:—తేలుకుట్టిందండి! అయ్యో! అయ్యో!

ప్ర:—అయ్యో ఎప్పుడూ? రండి, రండి ఇలా లోపలికి రండి మందు వేస్తాను.

(లోపలికి పిల్చుకు పోతారు)

రాజయ్య:—రమణా! అసలు తేలు ఎట్లా వచ్చిందిరా

ర:—కాదురా! మామయ్య దేవుణ్ణి చూపమన్నాడు గదూ! దేవుడు ఆ స్టూలులో ఉన్నాడు. తేలులోనూ ఉన్నాడు.

శ్రీధర్:—అయితే తేలులోనూ దేవుడు ఉన్నాడు గదా! దేవుడు అందర్నీ రక్షిస్తాడు గదా! మరి మామయ్యనెందుకు కుట్టాడు?

ర:—దేవుడు అందర్నీ రక్షిస్తాడు. కాని ఎవరైతే విఱ్ఱవీగి దేవుణ్ణి తిడతారో వాళ్ళకి కాస్త బుద్ధి చెప్తాడు.

రా:—అయితే రమణా! ఈ తేలే దేవుడంటావా! ఈ తేలును తేలంటాం. స్టూలును స్టూలంటాము. కాని దేవుడనమే! దేవుడని ఎట్లా తెలుసుకోవడం?

రమ:—అంటే! దేవుణ్ణి మనం ఈ కళ్ళతో చూడలేము. అలాగని దేవుడు మనకు దూరంలో లేడు. మన దగ్గిరే ఉన్నాడు. కాని మనం ఈ కళ్లతో మనకు నేరుగాఉన్న సూర్యుణ్ణి చూడగలమా! దూరదృష్టి అద్దంతో దగ్గర ఉన్నట్లు చూడగలం. అట్లాగే చిన్న చిన్న క్రిములను ఒక భూత అద్దం ద్వారా చూచినట్లైతే పెద్దవిగా కన్పిస్తవని పంతులుగారు చెప్పారుగదా! ఇంతెందుకూ! సినిమా మనం చూస్తాంకదా! అసలు ఫిల్ము చిన్నదిగా ఉంటుంది. సినిమా బొమ్మలు అసలు మనిషిలాగే కన్పిస్తాయి. ఈ మార్పుకు ఏం కారణం? దీనికి సహాయపడేది ఒక అద్దమేకదా! ఈ అద్దముద్వారాకదా మనం ఈవిషయాలను తెల్సుకోగలుగుతున్నాము. అట్లాగే మనం నిజంగా దేవుణ్ణి చూడడానికి మనకు ఒక అద్దంకావాలి కదూ! ఆ అద్దం ఉంటేనే మనం ప్రత్యక్షంగా

దేవుణ్ణి చూడగలం. అంతవరకు దేవుడు మనకు కళ్ళకు కనబడే రూపంలో కన్పిస్తూంటాడు.

రాజయ్య:—అయితే రమణా, నువ్వు చెప్పినట్లు ఆ అద్దం మనకు ఎక్కడ దొరుకుతుందిరా?

రమ:—అదా! దాన్ని జ్ఞానమంటారు. భక్తి అంటారు. అది మనలోనే దొరుకుతుంది.

శ్రీధర్:—అద్దిరా! ఇప్పుడు తెలిసింది. ప్రహ్లాదుడు, ధ్రువుడు ఈ భక్తిని గలిగి ఉండడంవల్లకదా దేవుణ్ణి ప్రత్యక్షంగా చూశారు. చూపెట్టారు గూడా!

అందరు:—అవున్రోయ్.

(ఇంతలో ప్రకాశంగారు బయటికివచ్చి రమణను పిల్చారు.)

రమ:—సరే మా నాన్న పిలుస్తున్నారు. మళ్ళీ మనం రేపు ఆడుకుందాం — మీరంతా వెళ్ళిరండి

(అందరూ వెళ్ళిపోతారు. రమణ తండ్రివద్దకు వస్తాడు.)

రమ:—ఏం నాన్నా?

ప్రకా:—ఆ మూల కూర్చొని ఏంజేస్తున్నావ్? ఆడుకోటానికి వెళ్ళలేదూ?

(అక్కడే కూర్చొని ఉన్నారు సుబ్బారావు)

సుబ్బా:—ఇదుగో మీ కొడుకే దేవుణ్ణి పెట్టుకొని భజనచేస్తున్నాడండీ—భజన. తనుకూడ ప్రహ్లాదుడిలాగ అవుతాడట.

ప్రకా:—(కోపంతో) ఏంరా? అలాగా! భజన చేస్తున్నావా?

రమ:—అవును. నాన్నా!

ప్ర:—నీకివన్నీ ఎవరు చెప్పారురా! చక్కగా ఆడుకోకుండాను. ఎంతంలేసి వాళ్ళో దేవుణ్ణి తలవనైన తలవటంలేదు. నీకేంరా! పసి పిల్లవాడివి

ర:—నాన్నా! మరి ప్రహ్లాదుడూ, ధ్రువుడూకూడ నావంటి పసిపిల్లలేకదా! వారు దేవుణ్ణి చూశారుగా!

ప్ర:—(కోపంతో) అయితే నువ్వు ధ్రువుడిలాగ తపస్సు చెయ్యడానికి అడవికి పోతావా? అసలిప్పుడు అడవులుకూడా లేవే!

ర:—కాదు నాన్నా, అడవికివెళ్ళి తపస్సు చేస్తేనే దేవుడుకనబడుతాడా! ప్రహ్లాదుడు మరి అడవికి వెళ్ళకుండానే దేవుణ్ణిచూశాడు. తండ్రికి గూడా చూపించాడు.

ప్ర:—(మరింత కోపంతో) చాల్లేరా వెధవ! పెద్ద నీతులు చెప్పవచ్చావు! చదువు సంధ్యలు మానేసి ప్రహ్లాదుడిలా భజన చేసుకొంటూ కూర్చో! నీ తెలివి తెల్లవారినట్లే!

ర:—అదికాదు నాన్నా, నామాటలు మీరు అర్థం చేసుకోటంలేదు. నేను ప్రహ్లాదునిలాగ దేవుణ్ణి చూస్తానని చెప్పానేకాని అడవికి వెళతాను. చదువుమానేస్తానని చెప్పలేదే!

ప్ర:—(నివ్వెర పోయి) అయితే నువ్వేమంటావు?

ర:—నేను చదువుకుంటాను. ఆటలాడుకొంటాను. అమ్మకు మీకు సహాయంగా ఉంటాను. తింటాను. తిరుగుతాను. అన్ని పనులు చేస్తాను. అయితే దేవుణ్ని ఎప్పుడూ భక్తితో ప్రార్థిస్తూంటాను. అప్పుడు నాకు దేవుడు ప్రత్యక్షమౌతాడు.

ప్రకా:—(ఆశ్చర్యంతో పులకాంకితుడై రమణ నెత్తుకొని) ఎంత బుద్ధిమంతుడవోయి. నా అజ్ఞానాన్ని అట్టే చీల్చిపారేశావు. సుబ్బారావుగారూ! దీనికేమంటారండీ!

సుబ్బా:—అనడానికేముందీ! భావి భారతీయ నాయకులు, భావి భారతీయ ప్రజలూను. మనకాలం ఈ అజ్ఞానంలోనే గడిచిపోతుంది.

# జర్మను

## కథలు! కబుర్లూ!

'జర్మానంద'

[జర్మను జానపద గాథల్లో ఎన్నో కథలూ, కబుర్లూ మనం వినవచ్చు. ప్రజాకోటి మంచితనాన్ని, అమాయకత్వాన్ని, ఇంకా మరెన్నెన్నో మనోభావాల్ని మనం వీటిమూలాన అవగాహనం చేసుకోవచ్చు. అలాంటి మనస్తత్వాలు మనకూవున్నందున, కథలు, కబుర్లూ జర్మను దేశానికి సంబంధించినవైనా, మన వాతావరణానికి సరిపోయినట్లే కనబడుతూ వుంటాయి వీటిని చదువుతూవుంటే. అంచేత కొన్ని ఘట్టాల్ని జర్మన్ జానపదగాథల్లో నుంచి సేకరించి "గృహలక్ష్మి" బాలలకు అందచేస్తూ వున్నాను.]

I

### రాజమార్గం!

అది వర్షాకాలం. అస్తమానమూ ఎడతెగక వాన కురుస్తూవుంది. ఇంట్లో వాళ్లు వాళ్ల వాళ్ల పనిపాటలను చూసుకొనడానికి బయటికి రావడానికి ఆ రోజుల్లో ఎంత కష్టంగా వుండిందో వృత్త మాటలతో చెప్పటం సులభంకాదు. క్రిందటి సాయంకాలం కురవ మొదలు పెట్టిన వాన పదిగంటలకు పైగానైనా ఆ రోజు ప్రొద్దున తగ్గిందికాదు. ఆయన ఆ రోజున అర్జెంటుగా ఆఫీసుకు తప్పనిసరిగా వెళ్లితీరాలి. పోకపోతే పని చెడిపోతుంది. దాని మూలాన బోలెడు నష్టము కలుగుతుంది. పొరుగింటి ఆయన ఆయన ఆదుర్దాను గుర్తించాడు. తన గొడుగును ఆ రోజుకి వాడుకోమని ఆయన కిచ్చాడు పొరుగింటాయన ఎంతో సానుభూతి సద్భావాలతో. ఆయన గొడుగును పుచ్చుకొని తన పని చూసుకొనడానికి ఆదరా బాదరాగా వెళ్ళాడు. ఆ పనిని యథాతథంగా పూర్తి చేసుకుని సాయంకాలానికి తిన్నగా ఇంటికి చేరుకున్నాడు.

మరునాడూ వాన యథాలాపంగా కురుస్తూనేవుంది. పొరుగింటాయన బయటికి వెళ్లాలసినపని వుండింది. అంచేత ఆయన ఈయన ఇంటిలోపలికి గబగబ తన గొడుగును తనకు తిరిగి ఈయమని అడిగాడు ఆతృతతో.

"భేష్! భేష్! మీకు గొడుగు నిస్తే నాపని ఏం కావాలి! ఇవ్వాళా మరో పనిమీద ఇంకో అర్ధగంటలో ప్రక్క వూరికి వెళ్ళాలి...." జబర్దస్తీగా జవాబు

ఇచ్చాడు ఈ పెద్ద మనిషి. గొడుగు సొంతదారుడికి ఆవాగుడు ఏమాత్రం అర్థమైంది కాదు. "అలా అంటారేమిటి? తొందరగా వెళ్ళాలసినపనివుంది..." అని తడబడుతూ నోరు పెగిల్చాడు.

ఈయనకి ఇలాటి విషయాల్లో పెట్టిందే పేరు. వాటిని సులభంగా తేల్చటంలో సిద్ధహస్తుడుకూడా! "అలాగయితే, బజారుకివెళ్లి మరొకదాన్ని కొనండి.... లేదా, మరో పెద్ద మనిషి దగ్గరనుంచి అరువైనా పుచ్చుకొనండి" అని అదురూ బెదురూ లేకుండా ఆ పెద్ద మనిషికి జవాబిచ్చాడు. ఇంకేంచేస్తాడు ఆ పొరుగింటాయన! తల తడుముకుంటూ తిన్నగా తన ఇంటికి నడిచి పోయాడు. ...

## ఒక మాట! ఒక బాణం!

ఒక రోజు సాయంకాలాన ఒక పెద్ద మనిషి తన ఇంట్లో ఒంటరిగా కూచుండి ఏదో చదువుకుంటూవున్నాడు. మంచి దుస్తుల్ని ధరించిన క్రొత్త మనిషి ఒకాయన తలుపు తట్టకుండానే, తన రాకని గురించి మరే సంజ్ఞను దేనినైనా చేయకుండానే ఆయన కూచుండి చదువుకుంటూ వున్నచోటికి ఎంతో ఆర్భాటంతోవచ్చి ఆయనకేసి ఎగాదిగా చూశాడు.

"మీ వీధి తలుపుతీసివుంది. ఇంటి ముందర నౌకర్లు ఎవళ్లూ లేనట్లువుంది. మీరిలా అశ్రద్ధచేస్తూవుంటే ఇంట్లో దొంగలు పడితేనో?...దొంగలు తిన్నగా ఈ చోటికేవచ్చి ఈ దీపాన్ని చప్పున ఆర్పేసి ఆ పెట్టెలోవున్న నగానట్రా పట్టుకుపోతేనో ..." అంటూ దీపాన్ని అతడన్నే ఆర్పేశాడు. పెట్టెను చప్పున తెరిచి దాన్లోని సామాన్లని మూటగట్టాడు. తన చేతికి అందుబాటులోనున్న ఇతర సామాన్లన్నీ పుచ్చుకుని మరో క్షణాన అక్కడినుంచి మాయమైపోయాడు

ఇంటాయన దీన్నంతా చూస్తూ స్తంభించిపోయాడు. కూచున్న చోటినుంచి లేచి ఆ దొంగను పట్టుకోటానికి దమ్ములు వుంటేనా? ఇరుగు పొరుగువాళ్లని సహాయానికి రమ్మని పిలవటానికి, మాట పెగిలి వస్తేగా! – ఆ అయోమయావస్థలో!

## అబ్బాయి హంగామా

ఆ వూళ్లో ఒక బాలుడు వున్నాడు. వాడికి మిలిటరీలో చేరాలని బోలెడంత ఆశ. వయస్సులో చిన్నవాడు. ఆ వయస్సు కుర్రవాళ్లని మిలిటరీవాళ్ళు చేర్చుకోరు. అంచేత ఏంచేయాలని ఆలోచించాడు ఎంతోసేపు. తటుక్కున మంచి ఆలోచన తట్టింది. దాంతో వుర్రూత లూగుతూ మిలిటరీ కార్యాలయానికి చప్పున వచ్చాడు. ఆ సమయానికి కెప్టను ఆఫీసులోనే వున్నాడు. ఆయనకు తన కోరికను చెప్పుకున్నాడు ఆ అబ్బాయి.

కెప్టన్ అబ్బాయిని ఎగాదిగా చూస్తూ "నీ వయస్సెంత ఇంతకూ ?" అని అడిగాడు.

"ఇప్పుడు నా వయస్సు పద్దెనిమిది ... చిన్నప్పుడు అడపాదడపా జబ్బుపడుతూ మూడేండ్లకాలం ఆస్పత్రుల్లో గడిపాను... లేకపోతే ఈపాటికి ఇరవై ఒకటవ సంవత్సరం నిండి, మీ రూల్సు ప్రకారం నన్ను మిలిటరిలో చేర్చుకునే వుండేవాళ్ళు." అదురూ బెదురూ లేకుండా ఆ అబ్బాయి జవాబిచ్చాడు.

దాంతో కెప్టన్ డంగైపోయాడు. మరో ప్రశ్న అడగటానికి ఆయనికి దమ్ములు ఏవీ!

## ఆయనకన్నా గట్టివాడే గుమాస్తా!

"ఏమయ్యా! నువ్వు ఖజానా పెట్టె తాళాల్ని పారేశావని అంటున్నావే. అలా గయితే దాన్లో దాచివుంచిన లెఖ్ఖల పుస్తకాల్ని ఎలా తీస్తావయ్యా ?" అని షాపు యజమాని గుమాస్తాను కంగారు పడుతూ అడిగాడు.

"చిత్తం చిత్తం దానికోసం తమరు అలా కంగారుపడితే ఎలాగు ? తమరు తెలుసుగా ఇంకోజత తాళాల్ని జాగ్రత్త పరచమని నాచేతికీయటం ?" అని గుమస్తా చప్పున జవాభిచ్చాడు యజమానికి.

"ఆ! జ్ఞాపకంవుంది. ఇలాంటి సందర్భాల్లో అవసరం వస్తుందనే ఆ జతని చేయించాను. వాటిని ఎక్కడ దాచి వుంచావుమరి ?" అని యజమాని ప్రశ్నించాడు.

"చిత్తం. ఆ జత జాగ్రత్తగానే దాచాను. ఇతర చోట్లలో పెడితే పోతాయని ఈ ఇనుపపెట్టెలోనే దాచానండి" అని సూటి జవాబిచ్చాడు ఆ గుమాస్తా.

## నగరంలో అందరూ నమ్మకస్తులే!

లాప్‌లండ్ దేశానికి రాజధాని పట్టణం టూలే. అక్కడ జనాభా రెండువేలచిల్లర. ఆ నగరంలో జైలులేదు, కోర్టులేదు, పోలీసులూ లేరు. అంత నమ్మకమైన జనం మరోచోట లేరంటే అతిశయోక్తి ఏమాత్రమూ వుండదు. అంచేత వాళ్లకి కోర్టూగటా్రలు అవసరమేలేదు.

దొంగతనం అనేది ఏమిటో వాళ్ళకి బొత్తిగా తెలియదు. ఇంట్లోనుంచి పని పాటలమీద వూళ్లోకి వెళ్లాలంటే ఇంటి వాళ్లు ఇంటిబీగాల్ని ఇంటిముందు చీలకి తగిలించి వెడుతూవుంటారు. వాటిని చూచాక ఇంట్లో ఎవళ్లూలేరని పరాయి వాళ్ళు సులువుగా తెలుసుకోవచ్చు.....

# 'రాగమయి'

శ్రీ విజయ – రాఘవ

(గతసంచిక తరువాయి)

## 9

కృష్ణమోహన్ పంపిన కబురు ప్రకారం సుందరమ్మ ఒకనాటి సాయంకాలం డాక్టరు కృష్ణమోహన్ యింటికి వచ్చింది. మర్యాదచేసి కూర్చోబెట్టాడు. సుందరమ్మ కృష్ణమోహన్ యిల్లంతా పరకాయించి చూసి, యింకా పెళ్ళికాలేదని గ్రహించింది. చాలసేపటివరకు యిద్దరూ మౌనంగా కూర్చున్నారు. సుందరమ్మకు మాత్రం అట్టే సేపు అలా కూర్చోవటం యిష్టంలేక పోయింది.

"మీ రెందుకో రమ్మన్నారట!" అని అడిగింది.

"మీతో ఒకసంగతి ముచ్చటిద్దామని" అన్నాడు.

"దానికేమండీ—అలాగే!" అంటూ చిర్నవ్వు నవ్వింది.

"మీ కేమీ అభ్యంతరం లేకపోతే శ్యామసుందరిని ..." అని చివరిమాటను పూర్తిచేయమని సుందరమ్మ వంతుకు వదిలాడు.

సుందరమ్మకు మిరుమిట్లు గొల్పాయి. "నిజంగా అంటున్నారా! లేక పరిహాసానికి అంటున్నారా!" అనిపించింది. కొంతసేపు యిలాంటి ఆలోచనలతో సుందరమ్మకు ఆశ్చర్యంముసుగు వేసింది. "అయినా నాతో పరిహాసం యెందుకాడతారు! వున్నమాట హృదయం విప్పిచెప్పారు. దాన్లో పరిహాసానికి తావు లేదే!"

శ్యామసుందరి యింతవరకెన్నడూ కృష్ణమోహన్ వెలిబుచ్చిన నిశ్చితాభిప్రాయాన్ని అంగీకరిస్తున్నట్లు తెలపలేదే! అయినా రోగిష్టిమనిషిని వివాహంచేసుకొంటానంటున్నారు. ఇందులో వారి నాకర్షించిందేమిటి? వారంతటవారే తనకూతురు భవిష్యత్ జీవితాన్ని సుఖపెడతామని అంటూంటే తనెందుకు అడ్డుతగిలి కాదనాలి! ఇంతకన్నా వేరుగా సంబంధం కుదిర్చి వివాహంచేయాలనుకోవడం తనవల్ల సాధ్యం కానిపని. వెతకపోయిన తీగె కాలికి తగిలినట్లు, అదృష్టంవచ్చి అందలంయెక్కమంటూంటే, బుద్ధిని బురదలోకి వెళ్ళమని చెప్పడందేనికి? ఇంతకన్నా శ్యామసుందరి జీవితాన్ని సుఖవంతంచేయగలనన్న ఆశ లేదు. శ్యామసుందరి — కృష్ణమోహన్ యీ విషయాన్ని గురించి బాగా ఆలోచించి ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చివుంటారు. లేకపోతే కృష్ణమోహన్ యింత మనస్థైర్యంగా చెప్పగలడా! శ్యామసుందరి ఆస్పత్రిలో వుండగా కొన్ని మందులు తాను కొనలేని స్థితిలో కృష్ణమోహన్ సహాయంద్వారా పుచ్చుకొంది. "ఎందుకండీ! యిలా నాకోసం మీరంతగా శ్రమపడటం" అని ప్రతిరోజూ అడగాలని అనుకొనేదికాని యేమనుకొంటారో అని వూరుకొనేది. శ్యామసుందరి, కృష్ణమోహన్‌తోగల ప్రేమవిషయాన్ని కడుపులో యింతకాలం దాచివుంచుకొని వుండగల్గిందీ అంటే, ఫలితం పొందితేనే బయటపెడదామని అనుకొంది. రాగమయికి కవరు యిచ్చి, దాన్లో యేభైరూపాయిలు వుంచి పంపినప్పుడు, మరికొన్ని కబుర్లుకూడా చెప్పింది. కాని రాగమయి కృష్ణమోహన్‌నిచూడగానే కవరుయివ్వడమనేదే గుర్తుకొచ్చింది కాని చెప్పవలసిన విషయం మరుగుపడిపోయింది. కృష్ణమోహన్‌కూడా ఆ విషయం యేదైనా చెప్పుతుందేమోనని కొంతసేపు వూహించాడు. కాని అటువంటిదేమీ జరక్కపోగా సుందరమ్మతో ముఖాముఖిగా మాట్లాడేందుకు వీలుదొరికింది.

"మీరేమంటారు యీ సందర్భంలో?" కృష్ణమోహన్ హఠాత్తుగా మళ్ళా అడిగాడు.

సుందరమ్మ తన జీవితచరిత్ర చెప్పుకొచ్చింది. ప్రస్తు

తం బ్రతుకుతున్న రీతినికూడా విపులంగా చెప్పింది. చివరకు, రఘునాధానికి, రాగమయికిగల పరిచయాన్ని కూడా సూచనగా తెలియచేసింది. కృష్ణమోహన్‌కి పంతో షంకలిగింది.

"మీ విషయం అంతా శ్యామసుందరి హాస్పటల్లో వుండగానే తెలియచేసింది. మీరేమీ భావించనక్కర్లేదు. శ్యామసుందరి రోగిష్ఠి మనిషని, ఆమెకు వివాహం కాకుండా పోతుందని యే విధంగానూ అనుకొని బాధపడక్కర్లేదు. ఒకనాడు మేమిద్దరం ఒకళ్ల జీవితాలొకరు చెప్పుకుంటూండగానే, యెవరెవరెట్లా బ్రతుకుతూ వస్తున్నారో తెలుసుకొన్నాం. నేనుకూడా చాలా కష్టాలనుభవించి, వారాలు చేసుకొంటూ, తల్లి దండ్రులు లేరనే చింతను మాటిమాటికి తల్చుకోకుండా, నేను చదువుకోవాలను చదువుని పూర్తిచేసుకొన్నాను. భగవంతుడి దయవల్ల ప్రస్తుతం యిలా పనిచేస్తున్నా. ఇన్నాళ్ళబట్టి నాకెందుకో వివాహమంటే అంతగా పట్టించుకొనేవాన్నిగాదు. కాని, శ్యామసుందరి ఆస్పత్రిలో చేరినరోజునే నాకెందుకో అమితమైన గౌరవం యేర్పడిపోయింది. వాస్తవంగా ఆమెకివ్వవలసిన మందుల్ని మీరుకొనలేనిస్థితిలో వున్నారన్న సంగతి తెలుసుకొనే, నా స్వంత డబ్బుతో కొని తెప్పించాను. ఈ సంగతి నా గొప్పనుగూర్చి చెబుతున్నాననుకోకండి. ఏదో మాటామాటా సందర్భంలో నిజంచెబుతున్నా" అంటూ కృష్ణమోహన్ చెప్పుకు పోతూంటే సుందరమ్మకు కలగన్నట్లుగా తోచింది.

"మీ పేరేమిటన్నారు?" –

"కృష్ణమోహన్"

"ఇదిగో! కృష్ణమోహన్‌గారు! నాకూ యెవరూ వెనక దిక్కులేరు. రఘునాధంకూడా యిప్పుడెక్కడున్నాడో తెలియటంలేదు. అతనికి తెలియకుండా యీ విషయంలో ప్రయత్నాలు జరుపుకోవడం యేం బాగుంటుంది చెప్పండి" – అంది.!

"అలా యెలా బాగుంటుందండీ! అంతకాలం అతను సహాయం చేసినవాడని తెలిసినతరువాత, యిలా తప్పుకున్నట్లుండడం యేంబాగు! తప్పకుండా అతనెక్కడున్నాడో వాకబుచేయండీ" – అంటూ కృష్ణమోహన్ నెమ్మదిగాలేచాడు.

సుందరమ్మకూడా లేవబోతూ "కాలం యిలా మారిపోతుందనుకోలేదు సుమా! యీ పిల్లనుగురించి నేనెంత బాధపడుతున్నానో నిజంగా భగవంతుడికే తెలియాలి. రఘునాధంకికూడా తప్పకుండా యీ విషయం తెలియచేస్తా. లగ్నాలుంటే మంచివి, పెట్టించి, శుభలేఖలు వేయించండి.!" అంటూ డాక్టరు కృష్ణమోహన్ తెప్పించిన జట్కాలో సుందరమ్మ వెళ్లిపోయింది.

కృష్ణమోహన్ ఆనాటి రాత్రి తీయని కలలు గన్నాడు. "తన బ్రతుక్కి నవవసంతోధయం కాబోతుందని ఆనందపడ్డాడు." –

"ఒక అనాధయువతి జీవితాన్ని ఉద్ధరిస్తున్నట్లుగా గర్వపడ్డాడు. చదువుకొన్నందుకు, తను చేయగల్గిన సహాకారం చేస్తున్నానని వుల్లాసపడ్డాడు."

సుందరమ్మ కృష్ణమోహన్ యింటినుండి సరాసరి తనింటి కొచ్చేసింది. శ్యామసుందరి ఆ సమయానికి తీరుబడిగా కూర్చొని యేదో పుస్తకం చదువుకొందామని ఆలోచిస్తోంది. సుందరమ్మ రావడం యింతలో శ్యామసుందరి చూచింది. మొగాన్ని బట్టే కొంత విషయం గ్రహించింది. సుందర్మ అదోలానవ్వింది శ్యామసుందరినిచూచి. రాగమయి తెల్లబోతూ యిద్దరి వంకచూసింది.

"ఏమిటీ అక్కా నవ్వుతున్నావ్!" అంది రాగమయి "అమ్మేగా ముందునవ్వింది: అడగరాదూ!" అంది శ్యామసుందరి.

"నన్నడగట మెందుకు! కాధానాయకి యెదురుగుండానేవుందిగా!" అంది సుందరమ్మ.

రాగమయికి పూర్తిగా మతిపోయింది. "ఏమిటి

దంతా! — "ఎవరికి వారే యిలా అంటున్నారేమిటీ!" అంది ఆశ్చర్యంతో

శ్యామసుందరి సుందరమ్మవంక చూస్తూ "ఏమన్నారు?" అని అడిగింది.

"ఏమనేదేముంది? మీరూ మీరు సంప్రదించుకొన్న దానికి నేనింకా చెప్పవలసిన దేముంటుంది. నీ జీవితం బాగుపడాలనేగా కోరేది! నీ కిష్టమైన దాన్ని నేనెలా కాదంటాను" అంది సుందరమ్మ.

రాగమయికి స్వల్పంగా అర్థమైంది. ఇంకా యీ సంభాషణ యిలా సాగితే ముచ్చటగా వుంటుందేమో అనిపించింది.

"వారుకూడా చాలా కష్టపడి పైకివచ్చిన మనిషి; వారనుభవించిన కష్టాన్ని గురించి చెబుతూంటే, మన బోటివాళ్ళకు యీడైన వారేననిపించింది." అని యింకా యేదో చెబుతూంటే సుందరమ్మ, రాగమయికి బాగా అర్థమైయింది.

"సరే ...! యింకా యేమన్నారు!" అంది శ్యామసుందరి.

"ఏమంటారు. - యీ వివాహానికి వారు స్థిరపడినారు - మంచి శుభ ముహూర్తంలో శుభలేఖలు మొదలుగా గలవన్నీ చూస్తానన్నారు" — అంది.

రాగమయికి రఘునాథం జ్ఞాపకంవచ్చాడు. శ్యామసుందరికి కృష్ణమోహన్ స్మరణకొచ్చాడు. రాగమయికి ఒకవైపు సంతోషం — బెంగ కలిగినయి. శ్యామసుందరికి హృదయమంతా ఆనంద పూరితంగా మారింది.

## 10

రఘునాథం రెన్నెల్లు సెలవుపెట్టి పొలంపుట్రా విషయాలు చూసుకొంటానికి వచ్చాడు. యిల్లంతా కలయచూచినప్పుడల్లా సుందరమ్మ — రాగమయి జ్ఞాపకమొచ్చినంత యెక్కువగా శ్యామసుందరి రాక పోవడంలో అతనికేమీ ఆశ్చర్యం కనిపించలేదు. ఎలాగైతేనేం సుందమ్మా వాళ్లు యెక్కడుందీ రఘునాథం వాకబుచేసి తెలిసికొన్నాడు. సరే వెడదామని రెండుసార్లు ప్రయాణం అయి, వూరిచెరువు దాకా వెళ్లి తిరిగి వచ్చాడు. "తాను మాత్రం చేయాలని యీ ద్రోహంచేయలేదు. గిట్టనివాళ్లేదో వ్రాస్తే కట్టుకథల్లాగా లోకంలో అల్లుకొని పోయింది. పండంటి సంసారాన్ని మట్టిపాలు చేద్దామని ప్రయత్నించారు. వాళ్లనిగురించి అసభ్యతగా తనకో వుత్తరం వ్రాశారు. ఆ వుత్తరం ఆనాడే చించి పారవేశాను. నిజంగా వాళ్లు చూడలేదుకాబట్టి, తనబ్రతుకీనాడు ఒకమాదిరిగా అన్నా వుంది" యిలా ఆలోచనలు సాగుతూంటే, వీధితలుపు తీసిన చప్పుడైంది.

డాబామీద రఘునాథం తొంగి చూచాడు. "ఎవరో — స్త్రీ" లాగాకనిపించింది. పాలేరు 'ఎవరూ?' అన్నాడు ఆ చీకట్లో

"నేనేరా! రఘునాథం బావగారులేరూ!" అన్నమాట రఘునాథానికి వినిపించింది.

"రాగమయి కాదుగదా!" అనుకొన్నాడు.

"పైనున్నారు వెళ్లండి" అంటూ పాలేరు డాబా మెట్లు చూపించాడు — రాగమయి మెట్లెక్కుతూంటే "బాగుండారా! అమ్మగారు" అని పరామర్శించాడు.

ఇదంతాకూడా వినిపించింది. ఇంతలో రాగమయి డాబామీదకు చేత్తో చిన్నసంచి పుచ్చుకొని వచ్చింది. రఘునాథానికి రాగమయి మొగంచూడటానికి బెరుకు వేసింది.

"బాగున్నావా! బావా!" అంది రాగమయి.

"ఆ... !" అన్నాడు హీనస్వరంలో రఘునాథం. రాగమయి గ్రహించింది, బావయెందుకో బాధపడుచున్నాడని.

"జరిగిందంతా మరిచిపో బావా! నువ్వెటువంటి వాడివో నాకు తెలుసు. నీవల్ల యేంతప్పులేదు. ఇదంతా యెవరివల్ల జరిగిందో తెలియకపోలేదు."

రాగమయికి యింతకన్నా యెలామాట్లాడాలో తెలియకపోయింది.

ఇంతలో పాలేరు లాంతరు తెచ్చి డాబామీద వుంచివెళ్లాడు.

రఘునాథానికి రాగమయి చేతులు పుచ్చుకొని క్షమాపణ చెప్పుకోమన్నంత ఆవేశం ముంచుకొచ్చింది. అదంతా దిగమ్రింగుకొని

"అమ్మ కులాసాగావుందా!" అన్నాడు. రాగమయికి అతని గొంతులో గాద్గదికం కనిపించింది.

"ఆ, కులాసే!" - అంది.

"అక్కయ్యెలావుంది!"

"జాగ్రత్తగా మందు పుచ్చుకొంటూనేవుంది. దగ్గుకూడా పూర్తిగా తగ్గిపోయింది. మామూలు ఆహారంతోపాటు పాలు, పండ్లు పుచ్చుకొంటోంది కూడా!" అంటూ శుభలేఖ అందించింది.

రఘునాథం ఆ శుభలేఖ నందుకొంటూ చిర్నవ్వుతో "ఎవరిదీ" అన్నాడు. రాగమయి యేం మాట్లాడలేదు. రఘునాథం పూర్తిగా చదివి "నీదేమో ననుకొన్నానుసుమా!" అన్నాడు.

"నాదని యెలాగనుకున్నావ్ బావా! అక్కయ్యకు కాకుండా నాకెలా అవుతూంది" అంది రాగమయి.

"దానికేంలే. అట్లా అనుకునేవి పాత రోజులు, యిప్పుడు రోజులు మారిపోయినయిగా. ఎవరికి ముందైతేనేం! అవటం ప్రధానంగా!" అన్నాడు.

"సరేగాని మరి యెప్పుడు బయలుదేరుతావ్ బావా!" అంది.

"ఇంతకీ ఎవరీ కృష్ణమోహన్?" అన్నాడు రఘునాథం.

"అక్కయ్యకి మందిచ్చిన డాక్టరుగారే" అంది క్లుప్తంగా.

"అదృష్టవంతురాలు శ్యామసుందరి. చదువుకున్నందుకు తెలివిగల పనే చేసింది. ఎలా వీళ్లిద్దరికీ సంబంధం యేర్పడింది" అన్నాడు రఘునాథం.

"ఒకళ్ళ మనసులు వొకళ్ళకి బాగా అర్థమైనయి. ఇద్దరూ యిష్టపడ్డారు. అమ్మనుకూడా డాక్టరుగారు సంప్రదించారు. అమ్మ యిష్టపడింది" అంది రాగమయి.

"దేనికైనా సమయం కలిసిరావాలంటారు పెద్దలు" అన్నాడు రఘునాథం.

రాగమయికి కృష్ణమోహన్ గురించి యింకా రెండు మాటలు చెప్పుదామనుకొంది.

"చాలా మంచివారు బావా! కట్నాలు పుచ్చుకోకుండా వివాహంచేసుకోవాలని అనుకొంటున్నారు. ఎన్నో కష్టాలనుభవించి డాక్టరుకోర్సు చదివారట. అక్కయ్యనుతప్ప మరెవ్వరినీ వివాహం చేసుకోనని అమ్మకు స్వయంగా చెప్పారట. మరి యీ వివాహానికి తప్పకుండా రావాలి నువ్వు. అందుకే యిదివరకటిదంతా మరిచిపోయి నిన్ను స్వయంగా పిల్వడానికి వచ్చాను - అక్కయ్య తరఫున, మా యింట్లో వాళ్ళందరి తరఫున" అంది రాగమయి.

రఘునాథం ఆ నాడు సుందరమ్మకు తన వివాహం గురించికూడా చెప్పి వుంచాడు చూచాయగా. రాగమయి ప్రత్యక్షంగాలేదప్పుడు. ఇప్పుడు ఎదురుగా వుంది. ఆ విషయాన్ని స్వయంగా అడిగితే అటో - యిటో తేలిపోతుంది అనిపించింది రఘునాథానికి.

"పాపా!" అయితే ఒక విషయంకూడా నీతో చెప్పాలనుకొంటున్నా. యీ విషయం గురించి లోగడ మీ సంసారమంతా యిక్కడ వుండగానే మీ అమ్మతో సంప్రదించాను. ఆవిడ సర్వవిధాల అనుకూలిస్తున్నానంది. నువ్వప్పుడు చదువుకొంటున్నావ్ కాబట్టి యీ విషయాన్ని గురించి తెలియనివ్వలేదు. అమ్మ ఒకవేళ చెబుతానంటుందేమోనని నేనే వొద్దన్నాను. ఇంకా ఆ విషయాన్ని దాచుకోవడమెందుకూ! దానివల్ల యేంలాభంలేదు - మరి ఇష్టమేనా!" అన్నాడు రఘునాథం.

రాగమయికి అడగబోయే విషయం సుందరమ్మ ముందే చెప్పివుంచడంవల్ల ఒక్క చిరునవ్వునవ్వి పెళ్లి కూతురులాగా తలవంచుకొంది. రఘునాథానికి అర్థమైంది తలవొంచుకోవడంలోగల భావం. అయితేనేం నోటితో చెప్పించుకోవాలనిపించింది. "ఇష్టంలేదా! పాపా! చెప్పరాదూ! భయమెందుకూ!" అన్నాడు. "ఊ... అలాగే... బావా!" అంది రాగమయి సన్నగా.

ఆ రాత్రి రాగమయికూడా రఘునాథంతో యెన్నో కబుర్లు ముచ్చటిస్తూ కాలక్షేపంచేసింది. అక్కయ్యకి - కృష్ణమోహన్‌కి యెలా సంబంధం కుదిరిందీ, అక్కయ్యను యెలా చూసుకొంటున్నదీ; తను యింతవరకు చెప్పుకొంటున్న ప్రయివేట్లను గురించీ, రఘునాథాన్ని తల్చుకొన్నప్పుడల్లా తాను పొందే బాధను గురించీ హఠాత్తుగా ఆనాడు తెల్లవారుఝామున ఎందుకు వెళ్ళిపోయిందీ, చించేసిన వుత్తరం యెలా దొరికిందీ, అవన్నీ వరుసగా చెప్పుకురావడం జరిగింది. "ఆవుత్తరం మీకు దొరికిందా!" అని ఒక్కసారిగా ఆశ్చర్యపడ్డాడు రఘునాథం. రాగమయి యిలాగే జీవితం యెలా గడుపుకొస్తున్నదీ చెప్పుకొస్తుంటే "పాపా! యిలారా!" అన్నాడు రఘునాథం.

"ఎందుకూ!" అంది రాగమయి. "మాట చెబుతా!" అన్నాడు.

రాగమయి దగ్గరగావచ్చి కూర్చొంది. "మరి మన పెళ్ళికి డబ్బుకావొద్దూ!" అన్నాడు. "అవును బావా!" అంది. రఘునాథం రాగమయిని ఒళ్ళోకి తీసుకొంటూ "ఇంతకాలం నన్ను చూడకుండా ఎలా వుండగలిగావ్ పాపా!" అని అడిగాడు. రాగమయికి యేంచెప్పాలో తోచలేదు. "ఇప్పుడవన్నీ యెందుకూ! వూరుకో - బావా!" అంటూ రఘునాథం హృదయానికి హత్తుకుపోయింది. రఘునాథం రాగమయి తలనిమురుతూ "ఎంతకాలానికి కనిపించావ్ పాపా!" అని మనసులో పిల్చుకొన్నాడు.

జరిగిపోయిన విషయాలన్నీ దిగమ్రింగుకొని సుందరమ్మ రఘునాథాన్ని పల్కరించింది. శ్యామసుందరి వచ్చి మంచినీళ్లిస్తూ యోగక్షేమాలు అడిగింది. రాగమయి కృష్ణమోహన్‌కి రఘునాథాన్ని పరిచయం చేసింది. ఇదంతా కృష్ణమోహన్ యింట్లో జరిగింది. అప్పుడే రాగమయి వివాహానికికూడా శుభముహూర్తం నిశ్చయించారు. యీ రెండు వివాహాలకు కావల్సిన ఖర్చంతా రఘునాథం — కృష్ణమోహన్‌లు భరాయించడానికి సమ్మతించారు. రఘునాథం తరఫున పెళ్లికి యెవ్వరూరాలేదు. ఏదోకొద్దిమంది మిత్రులు మాత్రంవచ్చారు. రఘునాథానికి చుట్టాలెవ్వరూ రాకపోయినందువల్ల దిగులులేదు.

సుందరమ్మ భగవంతుని తల్చుకొంటూ, చెదరిపోతున్న తన సంసారాన్ని అయినవాడు, పరాయివాడు యెలా ఆదుకొందీ, వివాహాలుకాని కూతుళ్ళనుచూసి అనుభవించిన బాధలకు పర్యవసానం భగవంతుడు అనుకూలించేటట్లు చేసాడని, నలుగురిలో తలవంపులురాకుండా రఘునాథం తనకు అన్ని విధాల సహకరిస్తున్నాడని, ఎన్నోసార్లు తల్చుకొంది.

రెండు వివాహాలు రఘునాథం యింటివద్దనే చేయడం నిశ్చయించింది సుందరమ్మ. రఘునాథం బ్రహ్మాండంగా పందిళ్లువేయించి, పాడుపడిపోయిందేమో అనుకొన్న యింట్లో మళ్ళా పరంజ్యోతి వెలగబోతోందని ఆనందపడ్డాడు.

గ్రామాన్నంతా రెండు పెళ్ళిళ్ళకూ పిల్చాడు. మూడు రోజులు పెళ్ళిళ్లు జరిగేలాగు చేయించాడు. రఘునాథం తరఫునుంచి, కృష్ణమోహన్ తరఫునుంచి చుట్టాలకన్నా, స్నేహితులు — పరిచయస్తులు యెక్కువగా వచ్చారు. అనుకొన్న లగ్నానికి ఆహ్వానితులంతావచ్చి వధూవరులపై అక్షింతలు చల్లుతూ "దీర్ఘాయురస్తు" అని దీవించారు. రఘునాథానికి, కృష్ణమోహన్‌కి స్నేహితులైన కలికిశోరాలు శుభాశీస్సుల చదివారు. తరువాత వధూవరులు పెద్దలకు నమస్కరించి, వారి దీవెనలుపొంది సుందరమ్మ దగ్గ

రకువచ్చారు. సుందరమ్మ పరమానందభరితురాలైంది. వాకిటవసారాలో మంగళవాయిద్యాలు హాయిగా మ్రోగుతున్నాయి. నూత్న వధూవరులు సుందరమ్మకు నమస్కరిస్తుంటే కామేశ్వరరావు ప్రక్కన లేకపోవటంతో కళ్లు చెమ్మగిల్లినయి. "రఘునాధానికి తల్లిదండ్రులు జ్ఞాపకంవచ్చారు. శ్యామసుందరికి, రాగమయికి తండ్రి, సుందరమ్మకు భర్త అయిన కామేశ్వరరావు, ఆ నాటి శుభసమయంలో, ఆ రోజు ఆనందోత్సవవేళలో, మంగళతూర్యారావాల్తో సందడిగావున్న కల్యాణమండప పందిట్లో గుర్తుకొచ్చాడు. అందరి నేత్రాంచల్లోంచి, అవ్యక్తమైన ఆనంద భాష్పాలు జాలువారినయి"

---

## నమో! నమో!

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

ఈశ్వర అల్లా ఏసు స్వరూపా!
శాశ్వత కారణ! జగదుద్ధారణ!
నమో! నమో!
శాంతియు, సహన, సమత్వ మహింసయు॥
సత్య సుగుణ మిదుమా! ॥ఈశ్వర
సహజ సంపదలు, శరీర బలమును
సద్వినియోగముసలిపి - జీవన
ప్రమాణ మధికముజేయ బ్రోవవే ॥ఈశ్వ॥
నిరుద్యోగ నిర్మూల మొనర్చి,
నిమ్నజాతి సముద్ధరించుచు,
విద్యారోగ్యము, సంఘసేవ, వ్యవసాయ
సంపదలు,
విద్యుత్, జలమును, విపిన సంపదలు,
పశుసంక్షేమము, పరిశ్రమలు
బహుళవ్యాప్త మొనరించుటకొరకై
కాపాడవె మమ్ము
కారుణ్య నిధీ! ॥ఈశ్వర॥

# విద్యావతి

శ్రీమతి "కవయిత్రీ తిలక" వసంతాదేవి



[గీర్వాణకవులలో 13 మంది కాళిదాసులున్నారు. అందులో ఒకానొక కాళిదాసు బహుశః పరిమళ కాళిదాసు - తొలుత విద్యావంతుడు కాడట. విద్యావతియగు రాజపుత్రిపై కోపముచే రాజగురువు ఆ పామరునకు రాజపుత్రి నిప్పించి వివాహము చేయించెను. ఆమె పాతివ్రత్య మహిమచేతను, కాళికాదేవి యనుగ్రహముచేతను అతడు కాళిదాసకవిశేఖరు డయ్యెనని పుక్కిటి పురాణకథ. "కావ్యమంజరి" అను ఖండకావ్య సందోహమునుండి.]

సేవలొనర్చి యంతిపురి జేరుటకున్ మునుముందుగా నహో
దీవన లందగోరి గురుదేవుని నొల్వఁగ వచ్చినట్టి నీ
పూవుబెదండ కృత్తమయి పోయె నటంచును క్రుంగె దేల వి
ద్యావతి దేవి నీ వొకటి దైవము వేరొకటిం దలంచెగా !

జీవితమంత నీ గురువు చేసిన ఘోరపరాభవమ్మునన్
తా వయి భగ్న మయ్యె ; ఇక తావు జగంబున లేదు నీకు వి
ద్యా వినయాదిరూప విభవాస్పదమై మతి గొన్నయట్టి నీ
పావనశీలమే తుదకు పా మయి పోయె గదమ్మ తల్లిరో !

కరకుగుండెలతో నీదు కంఠమునకు - ఉరి బిగింపంగ దలచిన గురువుగారి
కోర్కె ఫలియింపగా వెర్రిగొల్ల వాడు - తారసిల్లెను విధివ్రాత దాట వశమె!

మృదుమధురార్ద్ర భావరసమేళనమున్ సరి కూర్చు రాగముల్
హృదయవిపంచిపై పలుకరించెడు నీదరహాస గీతికల్
నిదురను గ్రుంకు భర్తమది నించుకయున్ గరగింప జాలమిన్
బెదరెద వేల నమ్మ, ఇక మేల్కొను నేమొ కదల్చి చూడుమా !

పైడివీణియపై మ్రోగు ప్రణయగీతి - ముదము నొడగూర్ప జాలునే మోదమునకు !

తల్లక్రిం దయ్యె తీయనితలపులనుచు - కనులలో నీరు నింపగా గలదె ఫలము ?

గజగజ లాడిపోయి నిను గాంచగనే పతిదేవు డంతయున్
నిజము వచించినాడు గురునీచుని తంత్రము నేడు నీపయిన్
విజయము పొందె నంచును వివేకము వీడగ నేల నమ్మ! నీ
ఋజు వగు శీలమే పతికి నెంతయు కీరితి సంతరించుతన్!

వసుధ సంచార మొనరించి వచ్చుతరికి - పతిని కులదేవి వర్చింప బంపు మమ్మ!
గుడిని గూర్చుండి తలుపులు గడియ వేసి-తీయ కుండినచో వర మీయ వచ్చు!
శాంతనిశ్చల మానిశా సమయమందు - స్తోత్రములు చల్లగా చెవి సోకినంత
భర్తకంతము నెటు గుర్తు పట్టినావొ - పరుగు వారెనవే జారి పడుదు వేమొ!
కాళిదాస త్త పాండిత్య కవిత విభవ-మాశుకవితా సుధాప్రవాహమ్ములోన
కొట్టుకొని పోవుగుండెలు పట్టలేక - వ్రాలిపోతివ భర్తపాదాల మీద!
కరములు పట్టి నిల్పి కులకాంతవు కా, విక నేటినుండియున్
గురువువు, దేవి నీవు, కయికోగదె నాదుకృతజ్ఞతాంజలుల్
కరుణ నటంచు వేడుకొను కాంతుని పల్కులలోన లోకముల్
తిరుగగ కన్నులం దవని దేవియొడిన్ తల దాచుకొంటివే!

తిరిగి చూడకయే భర్త యరిగినాడు -
ఇతరు లెరుగని విషయముల్ హృదయమందు
మరగి తెరలుచు నుండగా మరుగు పరచి
దినము లెటు వెళ్ళబుత్తువో దేలి యింక!

గర్వమున కన్నుమిన్నును గానలేక - విభుని దూషించె ననువవివేకులైన
లోకులకు నేమి తెలియు నీలోనిఘనత? - సత్య సౌశీల్య సౌభాగ్య సార మీవు!
కాళిదాస కవీంద్రుని కావ్యరసము - గ్రోలి యానందలహరుల నోలలాడు
సరసహృదయము నిండాదు శ్రద్ధతోడ - తలచులే నిన్ను కన్నులతడిని తల్లి!
కీర్తిహిమగిరి శిఖరాన నార్త డగుచు - భా మేఘ సందేశము బంప ప్రియుడు,
మందిరోద్యానసీమల నందికొనుడు-చదువుచున్నావ గృహలక్ష్మి చందమునను!

---

# ప్రేయసి



# వద్దకు



# ప్రయాణం

శ్రీ గిడుగు వేంకటరామమూర్తి

(గతసంచిక తరువాయి)

2—వ రంగం

[అదే యిల్లు - నాలుగు నెలలు గడచిన తర్వాత - కృష్ణమూర్తి ఒంటరిగా ఉండడం వల్ల, ఏమితోచక భర్తృహరి సుభాషితం చదువుతూ కూర్చుని ఉంటాడు. గదిలో సామాన్లు మునుపటి మాదిరిగానే అమర్చబడి ఉంటాయి. జూన్ 8వ తేదీ సాయంత్రం 4 గం సమయం]

కృష్ణ:—"హర్తకుగాదు గోచర మహర్నిశముల్ సుఖ
పుష్టిజేయు స
త్కీర్తి ఘటించు విద్యయను దివ్యధనం బఖి
లార్థి కోటికిన్
బూర్తిగ నిచ్చినం బెరుగబోదు యుగాంత
ప్రవేళనైన భూ
భర్తలు తీర్ధనాధికుల పట్టున గర్వము మాను
టొప్పగున్"

"భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద..."

రమేష్:—[ప్రవేశిస్తూ] ఏమిటిరోయ్ భర్తృహరి సుభాషితం చదువుతున్నావు?

కృష్ణ:—బి. ఎస్ సి. వరకు వెలగబెట్టాంగదా? విద్య వలనమనకు కలిగే లాభాలు ఏమున్నాయని కవి చెప్పాడో చూద్దామని బుద్ధిపుట్టి చదువుతున్నాను— రారా కూర్చో.

రమేష్:—రామాయణం, భారతం, భాగవతమైనా తీసి చదువు పుణ్యమైనావస్తుంది. [కూర్చుని, సిగరెట్టు వెలిగించి] నువ్వు వచ్చి మూడురోజులయిందిట! మమ్మల్ని మరచిపోయావా?

కృష్ణ:—ఇంకా చిన్ననాటి స్నేహితుల్ని మరచిపోయేటంతటి పెద్దవాడ్ని కాలేదు.

రమేష్:—ఏమోలే! గ్రాడ్యుయేట్ వవుతున్నావు గదూ?

కృష్ణ:—ఏం గ్రాడ్యుయేట్ నయితే కొమ్ములొస్తాయా? నిరుద్యోగుల లిస్టులో అంటే Employment exchange వారి లిస్టులో మన పేరుకూడా చేరుతుంది. గుమస్తాగిరీలకు తయారయే మానవ యంత్రాలలో నేనొకడిని. అంతే యింకేముంది? ...మీరు సిరిగలవారు, కాపిటలిస్టులు కనుక మీరు మమల్ని మరచిపోయే అవకాశాలు ఉన్నాయి—ఏమంటావ్?

రమేష్:—ఒరేయ్! ఎంతయినా ప్రాణస్నేహితుల్ని మరచిపోతామా?

కృష్ణ:—ఒక కవి చెప్పాడులే—

"ఉద్యోగరహితు నలసుని
నుద్యత్సాహస విహీను నొల్లదుసిరి సం
పద్యోగు గొల్వజేరదు
చోద్యముగా వృద్ధు తరుణి చూడని భంగిన్"



6

అలాగ సిరిగల తరుణుల వంటి మీరు, వృద్ధుల వంటి యీ బీదలను........

రమేష్:— ఆపరా! పద్యం చాలా బాగుందిలే... సరేగాని నీ నెక్స్టు (next programme) ప్రోగ్రాం ఏమిటి?

కృష్ణ:—Daily papers తిరగవేస్తూ ఉండడం, వీలయిన చోటికల్లా application పడేస్తూ ఉండడం, కాళ్లు అరిగేవరకు తిరుగుతూ ఉండడం!

రమేష్:—మరి వేరే ఏం లేదా?

కృష్ణ:—ఆకలి వేసినప్పుడు యింత మేస్తూ ఉండడం!

రమేష్:—ఒరేయ్, నీకు సీరియస్ సెన్స్ లేదురా.

కృష్ణ:—ఏం?

రమేష్:—Higher studies గురించి ఆలోచన ఏమీ లేదా అని అడుగుతున్నాను.

కృష్ణ:—ఈ B. Sc. పూర్తిచేసేసరికి యజ్ఞం చేసినంత అయింది. వీలుంటే వచ్చేజన్మలోHigher studies గురించి ఆలోచిద్దాం.

రమేష్:—ఒరే, మాలాంటి వాళ్లకు డబ్బున్నా ప్రయోజనంలేదు. మా Brains కు చదువు ఎక్కదు. మీవంటి తెలివైన వాళ్లయినా చదవకపోతే ఎందుకురా?

కృష్ణ:—మీ Brains ఖాళీ అయితే మా Pockets ఖాళీ—ఏం చదువమంటావు?

రమేష్:—ఇప్పుడు చదివి పేసవుతున్న వాళ్లంతా నీకన్నా గొప్పవాళ్లా? ఏదైనా ప్రయత్నించాలి కాని...

కృష్ణ:—ఎవరైనా వెనుక దన్నుంటే సరి. డబ్బు సహాయం చేసేవాడేనా ఉండాలి, లేకపోతే రికమెండు చేసేవాడేనా ఉండాలి. మనకెవరున్నారు?

రమేష్:—నేను ఉన్నాను గదరా నీకు! నీ యిష్టం వచ్చిన కోర్సుచదువు, ఎంత కావాలంటే అంత యిస్తాను.

కృష్ణ:—Thank you! నా విషయంలో అదొకటేనా! నేను చదువుతూ కూర్చుంటే యింటి సంగతి! మా నాన్న అప్పుడే ముసలివాడయాడా! ఇంకా ఎన్నాళ్లు కష్టపడగలడు. మా సుశీల పెళ్లికాకుండా ఎన్నాళ్లుంటుంది? తర్వాత భుక్తి!

రమేష్:—అదంతా నేను మాస్తానుగదరా! ... ఇదివరకే మీనాన్నతో చెప్పాను. కాని ఆయన అంత పట్టించుకున్నట్లులేదు.

కృష్ణ:—ఏం చెప్పావ్? ఈ విషయం మా నాన్న నాతో ఏం చెప్పలేదే!

రమేష్:—నీ చదువుకు కావలసిన సహాయం చేస్తానని, నీకు మంచి ఉద్యోగం దొరికేవరకు నా వద్దనే ఆయన ఉండవచ్చుననీ; మీ సుశీల పెళ్లికి కావలసిన సహాయం, ఏర్పాట్లు చేస్తానని చెప్పాను.

కృష్ణ:—సుశీల పెళ్లి దాని యిష్టాయిష్టాలమీద ఆధారపడి ఉంది. దాని పెళ్లయితేగాని మానాన్న దాన్ని వదలి పెట్టి ఉండడు.

రమేష్:—దాని యిష్టమేమిట్రా? పెద్దవాళ్లు తగిన సంబంధంచూసి చెయ్యాలిగాని?

కృష్ణ:—ఏదో యింతో అంతో S. S. L. C. వరకు చదువుకుందా? ఉద్యోగం చేస్తుందా! దాని మంచీ చెడ్డా దానికి తెలియదంటావా?

రమేష్:—దానికన్నా పెద్దవాడవూ నీ మంచీ చెడ్డా నీకే తెలియదే! చిన్నది దానికేం తెలుసు? అయినా, యితర విషయాలుకూడా ఆలోచించాలా! నీ future!

కృష్ణ:—నా future కోసం దాని స్వాతంత్ర్యాన్ని బలి పెట్టమంటావా? నాకిష్టంలేదు.

రమేష్:—నీకూ ఎక్కిందీ యీ స్త్రీ స్వాతంత్ర్య తత్వం!

కృష్ణ:—అంత తెలియని అమాయకులయితే, పెద్దలు జోక్యం కలుగజేసుకుని మంచీ చెడ్డా చెప్పి ఒప్పించ

వచ్చును. మా సుశీలకు ఆ మాత్రం జ్ఞానం ఉందని నా నమ్మకం.

రమేష్:—అంత తెలిసినదయితే ... ఆ మోహన్ గాడితో ఎందుకు తిరుగుతుంది ? వాడిని పెళ్లి చేసుకోడానికి ఎందుకు నిశ్చయించుకుంటుంది ?

కృష్ణ:—ఏమిటి ? మోహన్ను చేసుకుంటుందా ? ఇది నాకు ఒక కొత్త వార్త !

రమేష్:—నీ యింటి విషయం నీకు తెలియకపోవడం ఆశ్చర్యమే. ... వాడినుంచేగదా మీ నాన్న అప్పులపాలయ్యేడు. వాడికేమయినా విశ్వాసం ఉందీ ? వాడు యీ ఊళ్లో ఉన్నంతకాలం మీ నాన్న మొహం ఎత్తుకు తిరుగలేకపోయా డనుకో ! ... ఆ శనీశ్వరుడు మిమ్మల్ని వదిలి పోతానన్నా మీరు వదలకుండా పట్టుకోండి.

కృష్ణ:—ఈ విషయంలో నేనేం చెప్పలేనురా. సుశీల మరి ఎలా ఒప్పుకుందో ! ఆ మధ్య నాన్న నాకు ఉత్తరం వ్రాసినప్పుడు యీ విషయాలేమీ వ్రాయలేదు. కాని వాడిప్పుడు బుద్ధిమంతు డయ్యాడని, మర్యాదగా ప్రవర్తిస్తూ విజయ పురంలో ఉద్యోగం చేస్తున్నాడనీ వ్రాశాడు.

రమేష్:—వాడిబుద్ధి, వాడి ప్రవర్తనా అడగనక్కర లేదు. ఒరే ఎంతయినా దొంగ దొంగేరా ! ఒరే ఒక్క సంగతి ; వాడికి ఉద్యోగం దొర కిన తర్వాత మీ నాన్నకు ఎన్ని ఉత్తరాలు వ్రాశాడో కనుక్కో ; ఎంత ధనసహాయంచేశాడో కనుక్కో ; అసలు వాడు మీ ధనసహాయం అపే క్షించాడుగాని, మీకు సహాయం చేయాలని వాడికి ఉంటేగదూ ?

కృష్ణ:—అసలు యీ గొడవలు నాకేం తెలియవు. నా కంతా అయోమయంగా ఉంది.

రమేష్:—ఔను ; నిన్ను ఆ పరిస్థితిలో ఉంచారు మీ వాళ్లు ... ఇంతకీ వాడక్కడ యింకో పిల్లని పెళ్ళిచేసుకోబోతున్నాడు. మరో పదిరోజుల్లో పెళ్ళికాబోతోంది. తండ్రి పంటివాడుగదామీ నాన్న, ఆయనకేనా యీ సంగతి వ్రాశాడేమో కనుక్కో !

కృష్ణ:—ఈ సంగతి నీ కెవరు చెప్పారు ?

రమేష్:—[ఉత్తరం జేబులోనుంచితీసి] ఇదిగో చూడు, పెళ్ళికూతురు తండ్రి నాకు దూరపు బంధువులే, ఆయన నాకు ఉత్తరం వ్రాశాడు. వీడ్ని గురించి వివరాలు అడుగుతున్నాడు. పీటలమీద పెళ్లి తప్పించడం యిష్టంలేక చాలా మంచివాడని జవాబువ్రాసి పారేశాను. [సుశీల ప్రవేశించి, రమేష్‌వైపుచూసి యింట్లోకి వెళ్ళబోతుంది, రమేష్ సుశీలనుచూసి, పనిఉన్నవాడిలా లేచి] వస్తారా మళ్ళీ, [పోబోతాడు.]

కృష్ణ:—ఉత్తరం యిండ.

రమేష్:—చింపిపారేద్దూ ; నా కెందుకూ ఆ ఉత్తరం? వస్తా [అంటూ వెళ్ళిపోతాడు. సుశీల అటు వైపు తీక్షణంగా చూస్తుంది.]

సుశీల:—ఏమిటన్నయ్యా ఆ ఉత్తరం ?

కృష్ణ:—ఏం లేదూ ?_

సుశీల:—రమేష్ ఎందుకు వచ్చాడు ?

కృష్ణ:—నన్నుచూసి పోవడానికి ! [ఆలోచిస్తూ అంటాడు.]

సుశీల:—ఏమిటలా ఆలోచిస్తున్నావు ?

కృష్ణ:—ఆడదానివి నువ్వు ఆఫీసుకు వెళ్ళివస్తూ ఉంటే, మొగాడ్ని నేనింట్లో పనిలేకుండా కూర్చున్నాను గదా అని !

సుశీల:—ఇంకా డిగ్రీ చేతికిరాలేదు ; రిజల్ట్సుకూడ యింకా తెలియలేదు ; అప్పుడే దిగులా ?

కృష్ణ:—దిగులుకాదు ; తొందర !

సుశీల:—ఏదో కప్పిపుచ్చాలని మాట్లాడుతున్నావు గాని ... ఏమిటా ఉత్తరం ? ఇలా యియ్యి.

కృష్ణ:—నీకు సంబంధించిందికాదు. [జేబులో పెడ తాడు.]

సుశీల:—అయితే నీ దగ్గరే ఉంచుకో. ఆ రమేష్ ఎప్పుడువచ్చినా ఏదో కలత కలుగజేస్తేగాని బయటకుపోడు. ... మన మోహన్ అంటే యితనికి కిట్టదు. [పోబోతుంది.]

కృష్ణ:—సుశీలా! మోహన్ అంటే జ్ఞాపకం వచ్చింది. వాడెలా ఉన్నాడు యిప్పుడు?

సుశీల:—[ఆగి] ఏం? బాగానే ఉండి ఉంటాడు.

కృష్ణ:—అంటే వాడి దగ్గరనుండి ఉత్తరాలులేవా యిప్పుడు?

సుశీల:—మాట్లాడితేనే తప్పుగా భావించే యీ లోకం ఉత్తరాలు వ్రాస్తే ఊరుకుంటుందా?

కృష్ణ:—నీకు వ్రాయకపోవచ్చును; కాని నాన్నగారి పేర వ్రాయవచ్చునుగదా?

సుశీల:—మొదట్లో వ్రాశాడుకాని రెండునెలలయి వ్రాయడంలేదు.

కృష్ణ:—కారణం? [మాధవరావు ప్రవేశిస్తాడు.]

సుశీల:—తెలీదు.

మాధవ:—ఎవరు?

కృష్ణ:—మన మోహన్.

మాధ:—ఏమో తీరికలేదేమో! చదువుకునే కుఱ్ఱాడివి నువ్వు మహా తరచు వ్రాశావ్?

సుశీల:—పోనీ నువ్వు అతనికి ఉత్తరంవ్రాసి కనుక్కో అన్నయ్యా [అంటూ వెళ్తుంది. మాధవరావు, కండువా తీసి, కుర్చీమీద కూర్చుంటాడు.]

కృష్ణ:—ఏమండీ నాన్నగారూ! సుశీల మోహన్ను పెళ్ళిచేసుకుంటుందా?

మాధ:—ఔను; ఏం?

కృష్ణ:—ఇంతకన్నా మంచి సంబంధం దొరకదనా?

మాధ:—దానికి నచ్చినవాడిని అది చేసుకుంటుంది. నీ యిష్టం వచ్చిన పిల్లని నువ్వు చేసుకోవచ్చునని ఎలా చెప్పేనో అలాగే దానికీ చెప్పాను.

కృష్ణ:—అయితే మంచీ, చెడ్డా మనం ఆలోచించక్కర లేదా?

మాధ:—ఆలోచించాలి; ఆలోచించాను. దానికి యిష్టమయినవాడినిచూసి, నేను అంగీకరించిన తర్వాతనే, అది నిశ్చయించుకుంది.

కృష్ణ:—మీరు యీ సంబంధం అంగీకరించడం నాకేం నచ్చలేదు.

మాధవ:—ఏం? వాడికేం తక్కువయింది? వాడిప్పుడు బుద్ధిమంతుడు! సుశీల వాడిని చేసుకోడం నాకు సమ్మతమే.

కృష్ణ:—వాడికి నిలకడే తక్కువయింది!

మాధవ:—అంటే?

కృష్ణ:—సుశీలను చేసుకుంటానని ఒప్పుకున్నాడా?

మాధ:—ఒప్పుకున్నాడు.

కృష్ణ:—అలాంటివాడు, యింకో సంబంధం ఎలా ఒప్పుకున్నాడు?

మాధవ:—ఎవరి సంబంధం?

కృష్ణ:—ఈ ఉత్తరం చూడండి. [యిస్తాడు.]

మాధవ:—[చదివి] నిజమేనంటావా?

కృష్ణ:—నిజంకాకపోతే మరేమిటి? వాడికి కట్నంతో పిల్లవస్తోంది. మీరేం యివ్వగలరు? అవసరం తీరేవరకు మన యింట్లో మేశాడు. సుశీలను చెరచాలనుకున్నాడు. ఈ అమాయకపుపిల్ల ఆ దొంగ వెధవని నమ్మింది. నయం! దీన్ని గోతిలో దించలేదు.

మాధవ:—వాడి దగ్గరనుండి ఉత్తరంవస్తేగాని నేను నమ్మలేనురా!

కృష్ణ:—ఔను; మీరు దొంగల్ని నమ్ముతారు గాని యితరుల్ని నమ్మరు; మీరెలా నమ్ముతారు. అమ్మాయి నట్టేటిలో మునిగి ఉంటే నమ్మి ఉందురు. [సుశీలవస్తుంది] స్త్రీలకు స్వేచ్ఛ! స్వయంవరం! దొంగకి దొంగబుద్ధులు కాకపోతే

మంచి బుద్ధులెలా వస్తాయి? మీరింకా వాడిని నమ్ముతూ కూర్చోండి.

సుశీల:—మోహన్ను గురించేనా నీ లెక్చరంతా? దొంగ ఎప్పుడూ దొంగేనా? వాళ్ళలో పరివర్తనం ఉండదా? ... పైకి బాబుగా ఉండి లోన కుట్రలు పన్నేవాళ్ళంతా నీకు మంచివాళ్ళు, నిజాయితీ గలవాళ్లూను; ఆ రమేష్ వచ్చి నీకేదో నూరిపోశాడు ... నా విషయంలో నువ్వు జోక్యం కలుగజేసుకోకు.

కృష్ణ:—నాకు అనవసరమే! కాని ఆ ఉత్తరం చదువుకో నీ మోహన్ ఎంతటివాడో నీకే తెలుస్తుంది. ...ఇవ్వండి [తండ్రి చేతిలోని ఉత్తరం తీసుకుని చెల్లెలు చేతికిస్తాడు] చదువుకుని దాని భావి జీవితం అది నిర్ణయించుకుంటుంది. [సుశీల ఉత్తరం చదివి యిటూ అటూ తిప్పి చూస్తుంది. మాట్లాడలేక పోతుంది. కళ్లు చెమ్మగిల్లుతాయి. మొహం వివర్ణమౌతుంది.]

మాధవ:—ఏమోరా! సంబంధం ఉందికదా అని వాళ్లు వీడికి పిల్లని చూపించి ఉంటారు.

కృష్ణ:—అదొకటా? వాడొప్పుకున్నట్టు, ముహూర్తం నిశ్చయమైనట్టు ఉంది చదవండి. ... అది సరే, గాని, వాడిప్పుడు ఎందువల్ల ఉత్తరాలు వ్రాయడం మానుకున్నాడు? ఇదంతా ఏమిటి?

మాధవ:—నాతో చెప్పకుండా ఎలా ఒప్పుకున్నాడు! ఆ సంబంధం జరుగనివ్వను.

కృష్ణ:—ఇంతకు మనం అదృష్టవంతులమని సంతోషించాలి. ఇంతనిలకడలేని వీడి సంబంధం తప్పిపోవడమే మంచిదయింది. వాడు ఎలా ఏడిస్తే మనకేం? ఆ సంబంధం మనం బలవంతాన ఆపి అలాంటి దొంగ వెధవకి యిచ్చి పెళ్ళి చేస్తే యిదేం సుఖపడుతుంది. మన జాగ్రత్తలో మనం ఉండడం మంచిది. వాడి విషయం యిక తలపెట్టకండి...తండ్రివంటివారుకదా మీరు మీకు ఒక్క ఉత్తరం యీ విషయం వ్రాశాడా! వాడికి మీయందు విశ్వాసం ఉందీ! తర్వాత మీ యిష్టం, దాని యిష్టం [వెళ్తాడు]

సుశీల:—[అతి కష్టంగా] నాన్నగారూ నిజమేనంటారా?

మాధవ:—ఏమో? ఏం చెప్పను? మన కృష్ణకు యిదివరకొకసారి యీ సంబంధం వచ్చింది. ఈ సంబంధం యీ మనుష్యులు ఉన్నారని నాకు తెలుసు కాని ...

సుశీల:—అయితే నిజమేనేమో?

మాధవ:—నువ్వు ఉట్టినే బెంగపెట్టుకోకు! కనుక్కొనిదే నేనేం చెప్పను. వాడిని రమ్మని యివాళ ఉత్తరం వ్రాస్తాను. ముఖాముఖీని అన్నీ తేల్చుకుందాం.

సుశీల:—మీరేం వ్రాయవద్దు. అతనికి ఏ పిల్లనచ్చితే ఆ పిల్లనే చేసుకోనీయండి. మీరెవరూ, నేనెవరూ కాదనడానికి? అతడు మర్యాదగా జీవిస్తే అదే నాకు పదివేలు.

మాధవ:—సరే [వెళ్తాడు]

సుశీల:—నన్ను నమ్మించి మోసం చేశాడు. ఆడి తప్పాడు ... ఈ కాలంలో ప్రమాణానికి విలువ ఉందా? ... మోహన్! నన్ను నమ్మించి మోసం చేశావా? ప్రపంచంలో నేనే ప్రియమైన దానివన్నావు? అదంతా బూటకమేనా? నా ఆశలన్నీ నిరాశలేనా? నన్ను నమ్మించి మోసం చేశావా? అమ్మా! అమ్మా! నాగతి యింతేనా! అమ్మా! [పడి పోతుంది.]

తెర

(సశేషము)

# భారతదేశపు గడ్డమీద వలస ప్రభువులకు స్థానంలేదు

ఇండియాలో పెత్తనం చెలాయించడానికి తమకు "హక్కు" గలదని చెపుతూ, దానిని సమర్థించుకోడానికి గట్టి ఆధారం కోసం ప్రయత్నిస్తూ పోర్చుగీసు పాలక వర్గాలు, వలస ప్రాంతాలలోని జనాభా పోర్చుగీసు జాతిప్రజలలో ఒక భాగంగా వున్నారనే నమ్మరాని కారణం చెబుతున్నారు. అయితే వాస్తవానికి, పోర్చుగీసు వలసలలోగల అత్యధిక సంఖ్యాక ప్రజలు (నూటికి 99. 6 మంది) పూర్తిగా భారతీయజాతికి చెందినవారు.

అయినప్పటికీ గోవాలో చాలవరకు పాఠశాలల్లో విద్యాబోధన పోర్చుగీసు భాషలోనే జరుగుతూంది. ప్రజలను "పోర్చుగీసు జాతిగాచేయాలనే" ప్రయత్నంతో వలసప్రభువులు, స్థానిక భాషల లో సారస్వతవ్యాప్తిని అరికట్టేరు.

ప్రజలను తాత్వికంగా మార్చివేసే ఒక పద్ధతిగా పోర్చుగీసు వలస ప్రభువులు, భారతీయులు కేథలిక్ మతం పుచ్చుకునేటట్టు నిర్బంధంచేసేవారు. ప్రాచ్యంలో గోవా కేథలిక్ మత ప్రచార ప్రధాన కేంద్రాలలోఒకటిగా మార్చవేయబడింది. క్రిష్టియన్ నాగరికతా ప్రయోజనాలను భారతీయులకు అందించే "ఉన్నత ఆదర్శం" అనే సాకుతో శ్రీరంగ నీతులు చెబుతూ మతాధిపతులు స్థానిక ప్రజలను నిర్దాక్షిణ్యంగా దోపిడిచేసేవారు. లోబర్చుకోబడిన భారతీయ ప్రాంతాలలోని అత్యుత్తమమైన భూములు కేథలిక్ చర్చి ఆస్తిగా అయ్యాయి. భారతీయులకంటె, వారి ప్రాచీనమైన హిందూమతంకంటె వలస పెత్తనందార్లూ, కేథలిక్ మతమూ గొప్పవనే భావాన్ని మిషనరీ పాఠశాలలు తీవ్రంగా ప్రచారం చేశాయి. గోవా, తదితర పోర్చుగీసు వలసలలోని ప్రజలను బలవంతంగా కేథలిక్ మతం పుచ్చుకునేటట్టుచేయడంలో వలసపెత్తనందార్లువారిని తమ భారతీయ సోదరులనుండి తాత్వికంగా వేరుచేయడానికీ, వారి మధ్య మత వైరుధ్యాన్ని కల్పించడానికే ప్రయత్నించారు. కాని వారు తమ లక్ష్యాన్ని సాధించలేకపోయారు. గత జనాభా లెక్కల ప్రకారం, భారతదేశంలోని పోర్చుగీసు వలసలలోగల జనాభాలో కేథలిక్కులు అల్ప సంఖ్యాకులు.

భారతదేశంలోని పోర్చుగీసు వలసల ఆర్థికపరిస్థితి పరిశీలించినచో నాలుగు శతాబ్దాలకు పైగా గడచిన కాలంలో స్థానిక ప్రజలను దోచుకుని, సహజ సంపదలను కొల్లగొట్టి, తమకు లాభకరమైన ఆర్థిక శాఖలను మాత్రమే అభివృద్ధిచేస్తూవచ్చిన వలస ప్రభువుల పరిపాలనవల్ల యీ ప్రాంతాల ఆర్థికాభ్యు

క్షయం వెనకబడింది. ఆ విధంగా వారు యీ ప్రాంతాలకు గొప్ప నష్టం కలిగించారు.

పోర్చుగీసు వలస ప్రభువుల క్రూరత్వం, దోపిడి, స్థానిక ప్రజలలో ఆగ్రహాన్ని ద్వేషాన్ని రగులు కొల్పేయి; అవి పోర్చుగీసు పెత్తనంమీద తిరుగుబాటులుగా రూపొందేయి. ముఖ్యంగా ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం, జాతీయ విముక్తి పోరాటాలు తీవ్రమవడంతో యీ తిరుగుబాటులు తీవ్రరూపం దాల్చేయి.

నీచమైన దమననీతి సాగుతున్నప్పటికీ యీ ఉద్యమం, భారతదేశం స్వాతంత్ర్యం పొందినప్పటినుండి మరింత తీవ్రతరమైంది.

ఇప్పుడు భారతదేశంలోని పోర్చుగీసు వలసల ప్రజలు తమ విముక్తికై సాగించే పోరాటం, యీ ప్రాంతాలు తమ మాతృభూమితో విలీనంకావడానికి వారు సాగించే పోరాటంతో ఐక్యమవుతూంది.

పోర్చుగీసు ప్రాంతాలను నానా రకాల కుట్రలకూ, కుతంత్రాలకూ వుపయోగించడానికి వీలుగా, భారతదేశం వెనుక తట్టున గల తమ కీలక ప్రాంతంగా వాటిని పరిగణిస్తున్న అమెరికా పోర్చుగీసు అధికారుల వలస విధానాన్ని బలపరుస్తున్నప్పటికీ, వలస అవశేషాలనుండి తమ దేశాన్ని పూర్తిగా విముక్తిచేయడానికి సాగించే పోరాటంలో భారతీయులు విజయం పొందుతారన్నది నిస్సందేహం.

భారతదేశంతో జాతీయ, ఆర్థిక, చారిత్రిక బంధాలతో సహజంగా కట్టుబడివున్న భారతీయ ప్రాంతాలైన గోవా, డయ్యూ, డామన్ భారతదేశానికి తిరిగి యిచ్చివేయబడాలని భారత ప్రజలు, వారి ప్రభుత్వమూ చేసే న్యాయమైన డిమాండ్‌ను అభ్యుదయ మానవజాతి బలపరచి తీరాలి!

---

# ఆంధ్రకవుల వ్యంగ్యవాగ్వైభవం



(గతసంచిక తరువాయి)

ఎంతటి మహామహులైనా మన రామకృష్ణుని వ్యంగ్య విమర్శకు అతీతులుకారు. అలసాని పెద్దన - ఆంధ్రకవితా పితా మహుడు. భట్టుమూర్తి రామ రాజ సభా భూషణుడు. ముక్కు తిమ్మన ముద్దు ముద్దుగా కవిత్వము చెప్పటలో గొప్పవాడు.

అష్ట దిగ్గజాలలో అధికమైన గౌరవంకలవారు యీ ముగ్గురున్నూ. వీరిని పట్టుకొని ఒక రోజున రామకృష్ణుడు సభలో అవహేళనచేసి కడిగివేశాడు. "ప్రభూ, అల్లసాని పెద్దనగారు అటు ఇటు ఏడ్చి నారు. ముక్కు తిమ్మనగారు ముద్దు ముద్దుగా ఏడ్చి నారు. ఇక భట్టుమూర్తిగారు బావురుమన్నారు." అనేసరికి రాయలవారు పెద్దల నపహాస్యముచేయుట తగదని మందలించుచూ చేతనైనచో ఋజువుచేయ వలసినదని రామకృష్ణుని సాధికారముగా ఆజ్ఞాపించి నాడు. అట్టి అదనుకోసం వేచివున్న రామకృష్ణుడు వెంటనేలేచి, పెద్దనగారి మనుచరిత్రలో వరూధిని, తిమ్మనగారి పారిజాతాపహరణంలోని సత్యభామ, భట్టుమూర్తిగారి వసుచరిత్రలోని గిరిక ఏడ్చిన ఘట్టము లను తీసుకొని ఆ సందర్భములను వర్ణించుచూ, ఆయా మహాకవులు వ్రాసిన యీ మూడు పద్యములను సవ్యాఖ్యానముగా చదివి వినిపించినారట.

పాటునకింతు లోర్తురె కృపారహితాత్మక
 నీవు ద్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోకగనుంగొను
 మంచు నేడ్పు చూసిన
ప్పాటలగంధి వేదన సెపంబిడి యేడ్చె కల
 స్వనంబుతో
మీటిన గబ్బిగుబ్బ చనుమిట్టల నశ్రులు చింద
 పందగన్.

తిమ్మన్నగారి పద్యాన్ని ...

ఈనునబుట్టి, డెందమున హెచ్చిన శోకద
 వానలంబుచే
గానిలియేడ్చె ప్రాణవిభు కట్టెదుటన్ లలి
 తాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపై చేల చెడంగిడి బాల
 పల్లవ
గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూలాకల
 కాకలీ ధ్వనిన్.

భట్టుమూర్తిగారి పద్యాన్ని

ఆ జాబిల్లి వెలుంగువెల్లికల కాయంబోయి రాకా
 నిశా
రాజశ్రీ సుమైన మోమున బటాగ్రంబెత్తి
 యొత్తి యా
రాజీవాననయేడ్చె, కిన్నర వధూరాజత్కరాం
 భోజకాం
భోంజీ మేళవిపంచికా రవసుధాపూరంబు
 తోరంబుగాన్.

చదివి నా మాట కొప్పుకోక ఏంచేస్తారని నిగ్గతీసి అడిగాడు. తెనాలిరామునికి విజయసూచకంగా అంద రితోబాటు ఆ మహాకవులుకూడా తప్పట్లుకొట్టక తప్పలేదు. తెనాలి వాస్తవ్యుడైన యీ మహాకవి రచించిన పాండురంగ మహాత్మ్యము పదగుంభనలో సుప్రసిద్ధమైనది.

ఒకసారి రాయలవారు తన వాకిటి కావలి తిమ్మ నికి ఒక పచ్చడాన్ని బహూకరించారు. ఆ పచ్చడ మును కప్పుకొని యీ తిమ్మడు వాకిటి కావలి కాస్తుండగా పెద్దనవచ్చి-

వాకటి కావలితిమ్మా...

అని సంబోధించి లోపలికి వెళ్ళిపోయాడు. ఆ వెనుక భట్టుమూర్తివచ్చి,

ప్రాకటముగ సుకవి వరులపాలిటిసొమ్మా

అని పొగిడి లోపలికి వెళ్ళిపోయాడు. పిమ్మట ముక్కుతిమ్మనవచ్చి, 'నీకీపద్యముకొమ్మా'

అని ఉపాయనమొసగి ద్వారం దాటేసరికి రామకృష్ణుడుఅందరికంటే ఆఖరునవచ్చి 'నాకీ పచ్చడమిచ్చాలు నయముగ నిమ్మా'

అంటూ ఆఖరు పాదంచెప్పి ఆ పచ్చడాన్నే కాజేసి కప్పుకొని వెళ్లాడట సభలోకి.

తెలుగు భాషకు ఎనలేని సేవచేసిన మహామహుడు బ్రౌనుదొర. కృష్ణా, గోదావరిజిల్లాలలో 19వ శతాబ్ది ప్రారంభంలో న్యాయమూర్తిగా పనిచేసి తెలుగు భాషా మాధుర్యానికి ముగ్ధుడైపోయి పండితులను చేరదీసి స్వయంగా పాండిత్యాన్ని సంపాదించిన మనిషి. ఒకసారి ఒక పండితుడు బ్రౌను దొరగారికి మహజరు పంపించుకుంటూ తన కావ్యాన్ని కృతి స్వీకరించి లేమిని బాపవలసిందని ప్రార్థిస్తూ భాగవతంలోని యీ క్రింది పద్యాన్ని

లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె, ప్రాణంబులున్
ఠావుల్దప్పెను, మూర్ఛవచ్చె, తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడును
నీవేతప్ప నితః పరంబెరుగ మన్నింపంగదే దీనుడన్, రావే ఈశ్వర
కావవే వరద సంరక్షించు భద్రాత్మకా...

అని వ్రాసిపంపాడు. సరసుడూ, స్వయంగా మహా పండితుడూ అయిన బ్రౌనుదొర ఆ మహజరుపైన తన అభిప్రాయాన్ని నమోదు చేస్తూ జవాబుగా ఆంధ్ర మహాభాగవతంలోని క్రింది మరో పద్యాన్ని

ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుకొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి, కాలుచే
సమ్మెట పోటులంబడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పి నీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్......

ఉదహరిస్తూ: ముద్దుముద్దుగా మందలించి పంపేశాడట.

ఇలాగ, ఎంత చెప్పినా తరగనిది ఆంధ్ర వాఙ్మయంలో వ్యంగ్య వాగ్వైభవం.

(8_వ పేజీ తరువాయి)

లున్నాయి. దీన్ని (Aarey Milk colony) 'ఆరే మిల్క్ కాలనీ' అంటారు. పాలను సేకరించి, కాచి, కొలత ప్రకారం గాజుబుడ్లలో నింపి, కార్కులువేసి వాటిని విక్రయానికి సిద్ధపఱచే విధానం ఈ చోట ప్రదర్శింపబడుతుంది. దీన్ని సినిమాలలో కూడా చూపుతారు. కానీ, ప్రత్యక్షంగా ఇక్కడ చూడటంవల్ల మనకు అవగాహనకాని విషయాలు అనేకం తెలుస్తాయ్. పైగా, ఈ యంత్రాలు ఎంత వేగంతో ఏలాగు పనిచేస్తుంటవో కూడా బోధపడుతుంది.

బొంబాయినగరంలో రిక్షాలుగాని, ఆటోరిక్షాలుగాని, ఆటోమోటార్లుగాని కలికానికికూడా దొరకవు. రెండతంస్తులబస్సులు, ట్రాములుఎన్నియయినా నగర పరిసర ప్రదేశాల కెక్కడికయినా దొరుకుతాయి. ఈ కాలపు సంస్కృతివాసనలేని పామరులుకూడ 'క్యూ' పద్ధతిని అనుసరించటం ఈనగరంలోని, ఒక 'విశిష్ట' లక్షణం. బొంబాయినుండి హైదరాబాదుకు వచ్చేంతవరకు 'కాఫీ, తాంబూలం, ముక్కుపొడుం' మరచిపోవాలి. "చా" (తేనీరు) విస్తారంగా దొరుకుతుంది. అథవా కాఫీ యెక్కడైనా దొరికితే, అది కాఫీ వాసనే లేని కషాయం అనుకోవాలి. తమలపాకు విష్ణుమూర్తి శయనించే వటపత్రం. 'కాంచు' అనే పదార్థం ఆయాకుకు పట్టించి, గులకరాలవంటి యెండిన పచ్చిపోకముక్కలు చేర్చి తయారుచేసే ఒంటిఆకు బీడా ఇక్కడి "మృగమద సౌరభ విభవ ద్విగుణిత ఘనసార సాంద్రవీటి" గా భావించాలి. ముక్కుపొడుం బొత్తిగా దొరకదు. ఎక్కడయినా వుంటే, అందులో పొగాకు వాసన, ఘాటు, కమ్మదనం లేని సున్నని రంపపుపొట్టు మోస్తరుగా వుంటుంది. తీపిపిండి వంటలు మిఠాయిలు అమ్మే అంగళ్లు ఈ నగరంలో అమితం. "హల్వా" "ధూద్ పేడా"_లకు బొంబాయి ప్రఖ్యాతి వహించింది.

ఇక్కడి చలనచిత్ర ప్రదర్శనశాలలు దర్శనీయాలు. అందులో "మెట్రో"(Metro) "లిబర్టీ"(Liberty) అనేవి ముఖ్యమయినవి. రెండోది మొదటిదానికంటె అద్భుతమయింది; ఆనందదాయకమయింది

మేము 26_12_56 న గవర్నరు శ్రీ ప్రకాష్ గారిని ఉదయం 10_30 గంటలకి సందర్శించవలసి వున్నందున నాటిరాత్రి లిబ్రర్టీ థియేటరులో ప్రదర్శింపబడుతూవున్న 'రాజ్ హాత్' (Raj Hat) అనే హిందీచిత్రాన్ని చూడాలని నిర్ణయించు_కున్నాం.. ఉదయం కార్యక్రమం ప్రకారం, కాఫీ ఫలాహారాలు ముగించుకొని 'రాజ్ భవన్'కు బయలుదేరాం. రాజద్వారంలో వున్న హవల్దారు మమ్మల్ని లోనికి క్రమంగా తీసుకొని వెళ్ళి దర్బారుహాల్లో పరచి వున్న రత్నకంబళంమీద విద్యార్థుల్ని, గవర్నరుగారి ఆసనాని కిరుపార్శ్వాలా వున్న సోఫాలలో ఉపాధ్యాయులను కూర్చోబెట్టాడు. అలా ఇరవయి నిమిషాలు గడిచాయ్. గవర్నరుగారు సరిగా 10_30 _ గంటలకి చిరునవ్వుతో హాల్లో ప్రత్యక్షమయి తన పీఠాన్ని అధిష్ఠించాడు. మా ప్రధానోపాధ్యాయులు, పాఠశాలనుగూర్చి _ మా వినోదయాత్రను గూర్చి ముచ్చటించారు. శ్రీ ప్రకాష్‌గారు విద్యార్థులకు వుత్సాహజనకంగా నాలుగు మాటలు చెప్పి ఆశీర్వదించారు. తరువాత హాలుకు ప్రక్కనే వున్న వరాండాలోకి వారే మమ్ములను నడిపించారు. అక్కడ తబుకులలో చల్లని పానీయాలతో నింపబడ్డ గాజుటంబ్లర్లలోని సరకు కాస్తా మేము కాళీచేయగానే శ్రీ గవర్నరుగారికి వుపాధ్యాయులందరు పరిచయం చేయబడ్డారు. శ్రీవారు మాకు చేమోడ్పుతో వీడ్కోలిచ్చారు. వారిచే ఆజ్ఞాపింపబడ్డ యిద్దరు హవల్దార్లు రాజభవనంలోను, దాని పరిసరాల్లోనూ చూడదగిన ప్రకృతి విచిత్రాలను చూపారు. తరువాత మేము మాబసకు చేరి మధ్యాహ్నభోజనాలు ముగించుకొని కొంతసేపు విశాంతి తీసుకున్నాం. అందరూ యిండ్లకు జాబులు వ్రాసుకొనటానికి కొంచెం అవకాశం లభించింది. మా లీడరుగారు బలగాని కంతకూ రాత్రి 9 గంటల ప్రదర్శనానికి లిబర్టీలో టిక్కెట్లు 'బుక్కు' చేయించారు. రాత్రి భోజనానంతరం "రాజ్ హాత్" చలన చిత్రాన్ని లిబర్టీలో తెరమీద చూచి వచ్చాం. (27_12_56 నవే క్షీర పరిశ్రమ కేంద్రంము చూసినది). ఆరాత్రి 'మన్మాడు'_గుండా ఔరంగాబాదుకు తర్లి వెళ్ళాము.

(సశేషము)

# క ల గూ ర గం ప

## వ రు డు కా వా లి!

భరణీ పిక్చర్సువారి 'వరుడు కావాలి' చిత్రము తెలుగు, తమిళ భాషలలో భరణీ స్టూడియోస్‌లో నిర్మాణము పూర్తికానున్నది. నిర్మాత, దర్శకుడు శ్రీ రామకృష్ణ.

ఈ చిత్రము వినోదమును కల్పించే అమోఘమైన హాస్యరస పూరితమైన ప్రణయగాథకు సంబంధించినది. ఇందులో అశేష సత్కారములను ప్రసిద్ధ నటిగా బడసిన శ్రీమతి భానుమతి వ్యాపారి కుమార్తెగా నటిస్తున్నది. ఈమెతో శివాజీగణేశన్, చంద్రబాబు, టి. ఆర్. రామచంద్రన్, ప్రమీల వగైరాలు తమిళ చిత్రంలో నటిస్తున్నారు. తెలుగు చిత్రంలో జగ్గయ్య అమరనాథ్, టి. ఆర్. రామచంద్రన్, రమణారెడ్డి, డా॥ శివరామకృష్ణయ్య, ప్రమీల వగైరాలు నటిస్తున్నారు.

తెలుగు చిత్రానికి మాటలు, పాటలు శ్రీ 'రావూరు'గారి నిర్వహణ. ఈ చిత్రం జనవరిలో విడుదల కావలసియున్నది.

## శ్రీ ర మ ణ జ యం తి

భగవాను శ్రీ రమణమహర్షుల 77వ జన్మదినోత్సవము రమణాశ్రమంలో డిశంబరునెల 19 వ తేది నాడు అనేకమంది భక్తుల సమక్షమున జరుపబడింది.

కార్యక్రమము శ్రీ భగవానుని అరుణాచల అక్షర మానమాల గానముతో ప్రారంభమయి శ్రీ భగవానుని సమాధియొక్క బానలింగమునకు ఏకాదశ రుద్ర మహాన్యాస అభిషేకము ఉపనిషత్ పారాయణతో పాటు జరిగెను. పూజలు జరుగుచున్నప్పుడు సుప్రసిద్ధ తత్వాచార్యుడు డా॥ టి. యమ్. పి. మహాదేవన్ మాతృభూతేశ్వర మహా మండపంలో శ్రీ భగవానుని గురించి ఉపన్యసిస్తూ ఉపనిషద్‌ల లక్ష్యాలకు శ్రీ భగవాన్ జీవయాత్ర సజీవ వ్యాఖ్యానమని వివరించి నిజమైన భక్త కర్మయోగుల ఉద్దేశ లక్ష్యములను తన జీవితంలో చిత్రించారని వివరించారు. శ్రీ మహాదేవన్‌గారి ఉపన్యాసము ఉదాహరణలు, నిదర్శనములతో భక్తులలో శ్రద్ధా భక్తి ఆసక్తులను కలిగించినది. తర్వాత భక్తులు మహా సమాధి ఎదుటచేరి ధ్యాన నిమగ్నులైన మహా సమాధిలో శ్రీ భగవాన్‌యొక్క సర్వోత్కృష్టమైన శాంతి ఫలమును అనుభవించారు. ఈ సందర్భమునకుగాను రచింప బడిన శ్రీ మురుగనార్‌గారి రెండు పద్యాలు పఠించ బడినవి.

షుమారు వెయ్యిమంది అతిధులకు, అనేక వేలమంది బీదవారికి అన్నదానము జరిగెను. మధ్యాహ్నము శ్రీ రమణ భగవానుని కీర్తించి స్మరించునట్టి ఉపన్యాసములు, గోష్ఠి జరిగెను. శ్రీమతి సూరి నాగమ్మగారు తమ "రమణాశ్రమ లేఖలు" ఉపనిషదున చదివారు. సాయంకాలము శ్రీ నావలర్ దయానంద సరస్వతి (అన్న) స్వామి మాణిక్యవాచకర్‌ను గురించి ఉపన్యసించిరి.

## ఆ దో ని లో శ్రీ శా యి బా బ పూ జ

శ్రీ శాయి భక్తుల ప్రత్యేక కోరికపై శ్రీ స్వామి శాయి భక్త కేశవయ్యగారు మద్రాసునుండి శ్రీబాబా సందేశ ప్రచారము కొరకు ఆదోనివెళ్లి ఆ ప్రముఖ ప్రత్తి వ్యాపారి, బ్యాంకరు శ్రీ అర్ధగిరిబసవన్న గౌడ్ గారితో బసచేశారు. వారియింట్లో శ్రీ కేశవయ్యగారు డిశంబరు 22 వ తేది గురువారం రాత్రి శ్రీ శాయి బాబా పూజ చేసిరి. మరునాడు రాత్రి తుంగభద్ర ప్రాజెక్టు స్పెషలు కలెక్టరు శ్రీ వై. పిచ్చిరెడ్డిగారి యింట్లో పూజచేసిరి. ఈసందర్భమున ప్రముఖఅధికారులు, అనధికారులు, వర్తకులు, శాసన సభ్యులు 1500

పైగా పూజా ఆరాధనలలో పాల్గొనిరి. చాలమంది భక్తులు కర్నూలు, బళ్ళారి పరిసర ప్రాంతాలనుండి వచ్చి పూజారాధనలలో పాల్గొనిరి. భక్తి శ్రద్ధోత్సాహాలతో వెల్లివిరిసిన వాతావరణంలో స్వామి కేశవయ్యగారు తీర్థం, ప్రసాదం, విభూదిని పంచిపెట్టిరి. పూజలు రాత్రి చాల ప్రొద్దుపోవువరకు జరిగెను. 23 వ తేదిన జరిగిన బహిరంగసభ శ్రీ బసవన్న గౌడ్ గారి "ద్వారక" సినిమా హాలులో శ్రీ వై. పిచ్చిరెడ్డిగారి అధ్యక్షతన జరిగెను. అధ్యక్షులు స్వామి కేశవయ్యగారిని భక్తులకు పరిచయము చేస్తూ 18 సం|| నుండి శ్రీ శాయిబాబా సందేశ వ్యాప్తికిగాను నిస్వార్థంగా చేయుచున్న నిర్విరామ సేవను, మానసిక, శారీరక స్వస్థతలను సమకూర్చి భక్తులను ఉత్సాహపరుస్తున్న ఆయన దివ్యశక్తిని పేర్కొనిరి. శ్రీ కేశవయ్యగారు తమ 1½ గంటల ఉపన్యాసములో శ్రీ బాబా బోధనలను భక్తి, ఉపాసనల దృష్ట్యా వివరిస్తూ శ్రీ బాబా సంసార బంధములనుండి విముక్తులగుటకు నేర్పిన సులభమార్గమును వివరించిరి. భగద్గీత, యితర పవిత్ర గ్రంథములనుండి భక్తి మార్గాన్ని వివరిస్తూ ఉదహరించిచెప్పి ప్రేక్షకులను సంసార జీవితంలో బంక మట్టిలో చేప తనకది అంటకుండా యుండునట్లు గడుపవలసినదిగా ఉద్బోధించిరి. శ్రీ టి. జి. తిమ్మయ్యగారు యం. ఎల్. ఎ., అభివందనములు సమర్పిస్తూ శాయిభక్త కేశవయ్యగారి ఉత్సాహ పూరితులను చేస్తూ భక్త్యనుభవాలతో నిండిన ఉపన్యాసమునకు జోహారులర్పిస్తూ వానిని ఎవరైనను అనుభవంలో నుంచవచ్చునన్నారు. అనేకమంది ఉన్నతాధికారులు, సంపన్నులు వ్యక్తిగతంగా ఆధ్యాత్మిక రంగములోని సందేహములను నివృత్తిచేసికున్నారు. ఆయన అక్కడి 6 రోజుల మకాం వ్యవధిలో అనేకులు తమకష్ట, నష్టాలను, సమస్యలను శ్రీ శాయిబాబా సాన్నిధ్యంలో స్వామి కేశవయ్యగారికి నివేదించి రక్షణ, విముక్తులకు సలహాలను, మార్గాలను పొందారు. అందరికి శ్రీ బాబా సందేశమును సులభగ్రాహ్యంగా వెల్లడిచేసి శ్రీ బాబాపట్ల భక్తి విశ్వాసాలను పూరించాడు. ఆ ప్రాంతాలలో వారు మకాం చేసినంత కాలము ఉత్తమస్థాయిగల ఆధ్యాత్మిక, పారమార్థిక, వాతావరణము వెల్లివిరిసింది. స్థానిక వర్తక వ్యాపారస్తులను పూజారాధనలకుగాను మందిరమును కట్టించి శ్రీబాబా చిత్రపటమును ప్రతిష్టించవలసినదిగా కోరిరి.

•••◆•••

ఆంధ్ర మహిళా సభవారు (మైలాపూరు, మద్రాసు) నిర్వహిస్తున్న మహిళావిద్యాలయము, పారిశ్రామిక శిక్షణాలయము, ముద్రణాలయములలో విద్య, శిక్షణలపొందుట కనుకూలముగా కొందరు అర్హతగల బీదస్త్రీలకు భోజన, నివాసవసతుల కల్పించ నుద్దేశించబడినది. అందుకుగాను దరఖాస్తులు సెక్రెటరీకి జనవరి 25వ తేదిలోపల 4 అణాల తపాలబిళ్ళలతో చేరవలసియున్నది.




**చిన్నమ్మకథ : శ్రీమతి కె. చంద్రమతి, 53 యం. పి. కోయిల్ స్ట్రీట్ మద్రాసు 4. వెల రు. 1-4-0.**

శ్రీ పిఠాపురం మహారాజావారి ధర్మపత్నియగు స్వర్గీయ చిన్నాదేవిగారి చరిత్రను తనకు ఆమెతో గల పరిచయమును పురస్కరించుకొని యీ చిన్న పుస్తకము మహిళాలోకమునకని యుద్దేశించి కవయిత్రి వ్రాసిరి.

శ్రీమతి చిన్నాదేవిగారు అపరూప సౌందర్యముతో బాటు సకల సద్గుణసంపన్నురాలు, చక్కని విదుషీమణి, కవయిత్రి, ఆదర్శగృహిణీను. ఈమె పాతివ్రత్య, సౌశీల్యాలు స్త్రీరత్నముగా రూపొందించినవి. ఆమె పతిభక్తి, నిరాడంబర జీవితము, గృహకృత్యములయందలి ఆసక్తి, స్వజాత్యాభిమానము, విద్యా, వ్యాసంగ పాండిత్యగరిమలు, సంఘసేవపట్ల ఆసక్తి మహిళాలోకానికి ఆదర్శనీయమైనవని మరెవ్వరికి తెలియుటకవకాశములేని విషయమును గ్రంథరూపంగా తాను రచించి ప్రచురించారు. సరళమైన కవితా ధోరణిలోనున్న యీ గ్రంథమును సామాన్య స్త్రీలు సయితం చదివి ఉత్తమోత్తమమైన జీవితమార్గమును అనుసరించుటను తోడ్పడగలదని ఆశిస్తున్నాము.

**సర్వగీతార్థసారము: శ్రీ భూమండలేశ్వర స్వామీ శివానంద సరస్వతి మహారాజ్ అనువాదకులు : శ్రీ నందూరి వేంకటసుబ్బారావు, దక్షిణపు వీధి, ఏలూరు వెల రు2-0-0**

ఇందు ఉత్తరగీతతో ప్రారంభమయి సర్వగీతార్థసారము సులభగ్రాహ్యంగా రచింపబడినది. ఉన్నతమైన విద్యావిజ్ఞానములతోపాటు పాండిత్య ప్రకరణయున్ననేగాని గ్రహింప సులభసాధ్యముగాని సర్వగీతార్థసారమును సామాన్యప్రజలు సయితము పఠించి తెలిసికొనుటకనువుగా రచింపబడినది. ఇది పఠించుట వలన ఆధ్యాత్మిక విజ్ఞానము పెంపుకావడంతో బాటు పారమార్థిక, దైవచింతలతో దివ్యజీవితములను రూపొందించుకోగలుగుతారు.

**శ్రీ మద్రామాయణ భారతభాగవతసార సంగ్రహము : సంగ్రహకర్త-శ్రీ బులుసు అప్పలనరసింహము పంతులు. ప్రాప్తిస్థానము గుప్తాబ్రదర్స్, మెయిన్ రోడ్డు, విశాఖపట్టణము. వెల రు. 3-8-0**

రామాయణ, భారత, భాగవత మూలగ్రంథములను పఠించుటకు ప్రేరేపించుటకు యీ సార సంగ్రహము విశేషముగా నుపకరించు వచనగ్రంథము. 320 పేజీలగ్రంథము. సంగ్రహకర్త సాధ్యమైన క్లుప్తముగా రామాయణ, భారత, భాగవత విశేషములను పొందుపరచ ప్రయత్నించాడు. సామాన్యప్రజలు సయితం పఠించుటకనువుగానున్న యీ గ్రంథము విశేషప్రజాదరణకు పాత్రము కాగలదని మా విశ్వాసము.

---O---

# సంపాదకీయములు

## రానున్న ఎన్నికలు – మహిళలు

విద్యావిజ్ఞానాది యోగ్యతలతో, శక్తిసామర్థ్య ప్రజ్ఞావిశేషాలతో పరిపాలనా బాధ్యతలను పురుషుల కంటె స్త్రీలు మెరుగుగా, ఓర్పుతో నిర్వహించకలరేమో! అందుకుగాను పురుషులు తమ సద్భావసహకారములనిచ్చి రానున్న ఎన్నికలలో స్త్రీలకు తమతోబాటు సమానావకాశములు కలుగజేయడం వాంఛనీయము.

ఇప్పటికి ఏరాష్ట్రంలోగాని, కేంద్రంలోగాని కాంగ్రెస్, కాంగ్రెసేతర పార్టీలు యిట్టి విశాల దృక్పథంతో అభ్యర్థుల నిర్ణయం చేసినట్లు కనుపించదు. ఇది చాల అన్యాయం. అభ్యుదయ పురోగాముల మనుకుంటూ విద్యాది యోగ్యతలుండి జాతీయశ్రేయో పురోభివృద్ధులకు కృషిచేయడానికి ఉత్సహించుచున్న మహిళలకు అవకాశమివ్వని ఏపార్టీలోని పురుషులైనా విజ్ఞులనిపించుకోరు. స్త్రీలు సయితం కల్లబొల్లి కబుర్లను నమ్మకుండా జాతీయశ్రేయస్సుతోబాటు దానిని రూపొందించడానికి సమాన అవకాశాలకు, బాధ్యతల నిర్వహణకు, హక్కులకు పాటుపడటానికి తోడ్పడే విధంగా రానున్న ఎన్నికలలో వ్యవహరించాలని మా సలహా.

## శ్రీ పి. రామకృష్ణ, శ్రీమతి భానుమతిగారల ఔదార్యము

డాక్టరు కేసరిగారు కేసరి విద్యాలయములను స్థాపించి తెలుగు బాలబాలికలకు మద్రాసులో మాతృభాషలో విద్యావసతులను పదిలంచేశారు. ఆనాటికి యీనాటికి, పరిస్థితులు మారినవి. ఆంధ్ర ప్రాంతాలు మద్రాసునుండి విడిపోవడంతో తెలుగు బాలబాలికలకు మాతృభాషలో విద్యాసౌకర్యాలకేర్పడిన కేసరి విద్యాలయములపోషణ బాధ్యతలు మద్రాసులోని తెలుగువారికి మరింత గురుతరమైనవి. ఢిల్లీ, బొంబాయి, కలకత్తాలాంటి ఆంధ్రరాష్ట్రేతర ప్రాంతాలలోనే అక్కడి తెలుగువారు మాతృభాషలో విద్యావసతులకుగాను విద్యాలయములను స్థాపించుకొని స్వీయావకాశములకు కృషిచేస్తుంటే మద్రాసులో అమరియున్న తెలుగు విద్యాలయాలను తమ స్వీయావకాశములకు వినియోగించుకోడానికి తెలుగువారు ముందంజ వేయవలసిన ఆవశ్యకత ఎంతైనాకలదు.

సుప్రసిద్ధ సినితార శ్రీమతి భానుమతి, ఆమె భర్త శ్రీరామకృష్ణగారలు తెలుగు విద్యాలయములపోషణ ఆవశ్యకతను గుర్తించి కేసరివిద్యాలయముల అభివృద్ధి నిమిత్తమై యిచ్చిన రు. 4000 విరాళము మద్రాసు నగర తెలుగువారికి ఆదర్శమై, వాని పోషణ అభివృద్ధులకు అవకాశములు విస్తృతముకాగలవని మా నమ్మకము; ఈ సందర్భమున శ్రీరామకృష్ణ దంపతులు అభివందనీయులు.

దీనితోబాటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము రాష్ట్రేతరాంధ్రుల శ్రేయోపురోభివృద్ధులపట్లగల ఆసక్తితో మద్రాసులోని తెలుగు విద్యాలయాలకు యితోధికంగా సహాయంచేయడం వాంఛనీయము.

## యన్. జి. ఓ. లకు తాత్కాలికసహాయం

ఇప్పుడైనా కేంద్రప్రభుత్వము తక్షణమే యన్. జి. ఓ. లకు తాత్కాలిక సహాయము నుద్దేశించి త్వరలో కొన్ని ప్రతిపాదనలపై తుది నిర్ణయాలు చేయనుండటము సంతోషింపవలసిన విషయము.

యన్. జి. ఓ లు చాలీచాలని జీతాలతో గురియగుతున్న ఆర్థికదుస్థితి చాల విషాదకరమైనది. వారు చిత్తశుద్ధిలో తమ బాధ్యతలను న్యాయంగా నిర్వహించడానికి వారి కుటుంబముల పోషణకు అవసరమైన ప్రధానావసరములను తీర్చగలిగే ఆదాయమును ప్రభుత్వము సమకూర్చవలసియున్నది.

## 'సహజీవనమో! సర్వనాశనమో'

ప్రపంచమునకు 'సహజీవనమో! సర్వనాశనమో!' తప్ప గత్యంతరములేదని పండితనెహ్రూ హెచ్చరించుట వాస్తవికతను ప్రస్ఫుటిస్తున్నది.

ప్రతియొక్కజాతి, దేశము గౌరవంగా పరస్పర సహకార సద్భావములతో సహజీవనము చేయడానికి యాటంబాంబులు, హైడ్రోజన్ బాంబులు అవసరమని ఎవరనగలరు? అధికార ఆధిపత్యవాంఛలతో ఎంతటి సాహసానికైనా పూనుకొంటున్న రాజ్యాలు శాంతియుత సహజీవనమును ప్రోత్సహించగలవని ఆశించుట కవకాశములు యీ నాటికి బహు కొద్దిగా నున్నవి.

శాంతియుత సహజీవనము అమలులోనికి రావాలంటే పరస్పర సానుభూతి సద్భావాలు వర్ధిల్లాలి. ఏరాజ్యాని కారాజ్యం, ఏ జాతి కాజాతి స్వీయసౌభాగ్యానికి యితరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు భంగము కలుగనిరీతిన కృషిసల్పుకొని ఉమ్మడి మానవ శ్రేయస్సును ప్రోత్సహించాలి. అన్ని రాజ్యాలు, జాతులు సమైక్యంగా ఏకోన్ముఖమైన శాంతియుత సహజీవనమును ఉద్దేశించినచో శాంతి సౌభాగ్యములు సుస్థిరము కాగలవు. లేనిచో సర్వనాశనముకంటె గత్యంతరములేదు.

## గ్రామీణ ప్రజల అభివృద్ధి - జాతిపురోగతి

గ్రామీణ ప్రజల అభివృద్ధిమీదనే జాతీయ పురోభివృద్ధి ఆధారపడియున్నదనే సూత్రం గాంధీజీ సూత్రాలలో ప్రధానమైనది.

గ్రామీణ ప్రజలలో ప్రధానంగా విద్య, విజ్ఞానములు వ్యాప్తి నొందాలి. తాము నిర్వహించే వృత్తులను నవీన మార్గాలలో మరింత ఫలప్రదంగా నిర్వహిస్తూ జాతీయ సౌభాగ్యమును పెంపుజేయడాని కనువైన విద్య, విజ్ఞానాలు గ్రామీణ ప్రజలకు అత్యవసరము.

గ్రామీణ ప్రజలకు జీవితావసరాలకు లోటులేని శ్రమకు తగిన ఆదాయం అమరాలి. వైద్యసదుపాయాలు విస్తృతమై ఆరోగ్య రక్షణ జరుగాలి. నిరుద్యోగులుగా అనారోగ్యానికి, ఆకలి దప్పులకు అలమటించడమును అరికట్టిననాడు గ్రామీణ ప్రజల సమస్యలు చాల వరకు పరిష్కారము కాగలవు.

## పంచాయతి పరిపాలన

ఈ మధ్య గ్రామపంచాయతి ఎన్నికలలో కొన్నిటికి మహిళలు అధ్యక్షురాండుగా ఎన్నుకోబడిన సందర్భమున మేము వారిని హృదయపూర్వకము అభినందిస్తున్నాము.

గ్రామపంచాయతి పరిపాలనలోముఖ్యంగా అధికారదర్పము, ఆధిపత్య వ్యామోహంకంటె గ్రామంలో శిస్తులమూలంగా సమకూరే ఆదాయమును గ్రామాభ్యుదయానికీ, ప్రజలశ్రేయోభివృద్ధుల నుద్దేశించి ఖర్చుపెట్టటం. ఇందులో స్వార్థమునకు, సంకుచిత తత్వాలకు చోటు లేకుండాయుండి ప్రజలసహాయ సహకారముల నాధరము చేసికొని పరిపాలన నిర్వహించినచో ప్రతిపంచాయతి ఆదర్శప్రాయమైనది కాగలదు. మహిళలు చిత్తశుద్ధితో, నేర్పుగలిగి పంచాయతి పరిపాలన నిర్వహించకలరని మా విశ్వాసం. ఆయవకాశాన్ని వారికివ్వడం సయితం శ్రేయస్కరము.

# శ్రీ దుర్ముఖినామ సంll ర పుష్య, మాఘ మాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | బు | ○ పౌ 15.0 పున 18.10 త్యా 3.43 |
| | 17 | గు | కృపా 8.59 పుష్య 13.50 త్యా 3.42 |
| | 18 | శు | వి 2-40 ఏప్యం 53.13 ఆశ్లే 9.16 త్యా 3-42 |
| | 19 | శ | చ 50.13 మఖ 4.44 త్యా 3-43 |
| | 20 | ఆ | పం 44.45 పూఫ 0-31 ఉఫ 56.9 త్యా 4-44 |
| జనవరి నెల | 21 | సో | ష 40.6 హ 53-21 త్యా 3.49 |
| | 22 | మం | స 36.25 చి 52.3 |
| | 23 | బు | అ 33-51 స్వా 51-22 |
| | 24 | గు | న 32-32 విశా 51-55 త్యా 4.3 |
| | 25 | శు | ద 32.28 అనూ 53.42 త్యా 4-8 |
| 1957 సంll | 26 | శ | ఏ 33.38 జ్యే 56.39 రిపబ్లిక్ దినోత్సవము |
| | 27 | ఆ | ద్వా 35.56 మూ 60.10 త్యా 4-18 |
| | 28 | సో | త్ర 39.13 మూ 0.52 త్యా 4.23 |
| | 29 | మం | చతు 43.16 పూషా 5-43 త్యా 4.23 మాసశివరాత్రి |
| | 30 | బు | ● అమా 48.53 ఉషా 11-14 త్యా 4-24, గాంధీజీ నిర్యాణదినం |
| | | | **మా ఘ మా స ము** |
| | 31 | గు | శుపా 52.45 శ్ర 17-8 |
| | 1 | శు | వి 57-39 ధ 23.9 త్యా 4.24 |
| | 2 | శ | త 60.10 శత 29-2 |
| ఫిబ్రవరి నెల | 3 | ఆ | త 2-7 పూభా 34-30 త్యాజ్యాభావః |
| | 4 | సో | చ 6.2 ఉభా 39.18 త్యా 4.20 |
| | 5 | మం | పం 9-8 రే 43.14 త్యా 4.16 |
| | 6 | బు | ష 11-13 అశ్వ 46.8 త్యా 4-12 సుబ్రహ్మణ్యషష్ఠి |
| | 7 | గు | స 12.9 భ 47-47 రథసప్తమి |
| | 8 | శు | అ 11.49 కృ 48.13 త్యా 4-2 |
| | 9 | శ | న 10.14 రో 47-26 త్యా 3-57 |
| 1957 సంll | 10 | ఆ | ద 7.26 మృ 45-30 త్యా 3.53 స్మార్తభీష్మైకాదశి |
| | 11 | సో | ఏ 3-31 ఏప్యం 55.21 ఆర్ద్రా 42.30 మధ్వ, రామానుజైకాదశి |
| | 12 | మం | త్ర 53.8 పున 38-49 |
| | 13 | బు | చతు 46.56 పుష్య 44.3 |
| | 14 | గు | ○ పౌ 40-33 ఆశ్లే 29.59 వ్యాసపూర్ణిమ, తిరువత్యూరు పొగడమానుసేవ |
| | 15 | శు | కృపా 34-12 మఘ 25-26 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



ఆదోనిలో శ్రీ స్వామి శాయిభక్తకేశవయ్యగారు శ్రీ శాయిబాబా పూజలుచేసిన సందర్భపు చిత్రము. ఇందులో శ్రీ స్వామితో బాటు శ్రీ అర్ధగిరి బసవన్నగౌడ్, శ్రీ వై. పిచ్చిరెడ్డిగారలు కలరు.

*By courtesy of "Free India"*

ఈజిప్టుపై ఆంగ్లో ఫ్రెంచి, ఇజ్రైల్ దళాలు దాడిజరిపిన సందర్భమున పరిస్థితిని చర్చించుటకు న్యూఢిల్లీలో జరిగిన సమావేశములో పాల్గొనిన కొలంబో రాజ్యాలప్రధానులు – బర్మా, సిలోన్ ఇండోనీసియా, ఇండియా, ప్రధాన మంత్రులిందుగలరు.